# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 రాజమహేంద్రవరము 1-7-1980 సంచిక 17




—* ఈ సంచికలో *—



16—7—1980 సంచికలో ఋతుఘోష - ఒక పరిశీలన, ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు, ఋషి కవి ఔ తాడా? పంచాంగ వైరుధ్యాలు, రామాయణానికి ఊపిరి ఊర్మిళ మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా :
సంవత్సరమునకు రు. 10—00.
అర్ధసంవత్సరమునకు రు. 5—50.

విడిప్రతి 50 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 8 | రాజమహేంద్రవరము 1-7-1980 | సంచిక 17

# పారిజాతాపహరణ కావ్యసౌరభము

— శ్రీ ఎ. క్రిష్ణప్ప, ఎం. ఏ., బి. యస్ సి.,

శ్రీకృష్ణ దేవరాయల యాస్థానకవి, ంధ్ర పంచ మహా కావ్యములలో నొక టైన 'పారిజాతాపహరణము' కృతికర్త, ంది సింగయ తిమ్మాంబల తనయుడు, లయమారుతకవి మేనల్లుడు, సకల ద్యాచతురుడు నంది తిమ్మనార్యుడు.

తిమ్మన కావ్యాంతములోని ఈ క్రింది పద్యము వల్లనే యీతనిని గూర్చిన వివరములు తెలియుచున్నవి.

'కౌశిక గోత్రవిఖ్యాతు, నాపస్తంబ
సూత్రు, నార్వేల పవిత్రకులుని,
నంది సింగామాత్యునకును, దిమ్మాంబకుఁ
దనయుడు, సకల విద్యావివేక
చతురుడు, మలయమారుత కవీంద్రునకు మే
నల్లుండు, కృష్ణరాయ క్షితీశ
కరుణా సమాలబ్ధ ఘనచతురంత యా
న మహాగ్రహార సన్మానయుతుడు,
తిమ్మయార్యుండు, శివపరాధీనమతి, య
ఘోర శివగురు శిష్యుండు, పారిజాత
హరణ మను కావ్యమొనరించె నంధ్రభాష
నా దివాకర తారా సుధాకరముగ.'

తిమ్మన తన కవిత్వ రీతిని గురించికాని, కథకు మూలమును గూర్చిగాని తన కావ్యములో నెక్కడను జొప్పింపలేదు. కాని తిమ్మన యీ విషయములను వ్యక్తపరచి నట్లు సూక్ష్మపరిశీలనవలన తెలియును.

ఈతని కథకు మూలము 'హరివంశము' అను విషయమును కావ్యారంభములో చేర్కొన్న 'హరివంశకథలెల్ల' అను శబ్ద ప్రయోగము వలన గ్రహింపవచ్చును. తిమ్మన యీ యితి వృత్తము నెన్నుటకు కృష్ణరాయల యంతఃపుర రహస్య మొకటి కారణ మను విషయమును పీఠికలో చేర్కొన్న 'సరస పుటల్కదీర్చు తఱి' అను ప్రయోగము వలన గ్రహింప వచ్చును.

తిమ్మన కృతి కర్తృకీర్తనము, సుకవి స్తుతి, కుకవినింద, కావ్యమునఁ జొప్పింప లేదు. గ్రంథాదిలో శ్రీ వేంకటేశ్వరుని ఈశ్వరుని, విఘ్నేశ్వరుని, లక్ష్మీసరస్వతు లను స్తుతించి, పిమ్మట చంద్రుని కూడ వర్ణించినాడు. కావ్యకృతి భర్త చంద్ర వంశజుడు అగుటయే దీనికి కారణము.

తిమ్మన కవిత్వమును గూర్చి యాకాలపు కవులే 'మాకొలది జానపదులకు సీకవితా రీతి యబ్బునే' అనియు; 'ముక్కు తిమ్మ నార్యు ముద్దుపలుకు' అనియు శ్లాఘించి యున్నారు. కావ్య పీఠికలో పేర్కొన్న 'తన మృదు గీతికా పరిణతి ధ్వని వైఖరి', శ్రీకృష్ణుడు సత్యభామ నను నయించు నప్పుడు 'పలుకుల దేనెలుట్టి పడ బల్కు', శ్రీకృష్ణుని మేల్కొలుపుటకు 'మృదు గీతామృత వచనరచన గీలుకొన' మొద లగు ప్రయోగములను బట్టి, తిమ్మన కవి త్వము తేనె లుట్టిపడు పల్కులవలె, మృదు గీతికా పరిణతధ్వని వైఖరివలె, మృదు గీతామృత వచన రచనవలె నుండును.

తిమ్మన ద్వితీయాశ్వాసములో జేసిన నక్షత్ర వర్ణనము తిమ్మన భావనాపటిమకు గీటురాయి.

'కార్కొన్న కటికి చీకటి మొగు
ల్మొత్తంబు
గురిసిన వడగండ్ల గుంపు లనగ
గవ జక్కవలు వాయఁ గరనాళములఁ
జందు
రుం డూదు పటికంపు టుండలనగ
నెల్లెడ మిన్నేటి యిసుమున నచ్చర
కొమలిడ్డ వెన్నెల కుప్పలనగ
దెలివి వెన్నెల వెంట తీగలు నిగిడించు
చవలు కమ్మమ్మ బెజ్జములనంగ
జగము గెల్వంగ దండెత్తు మగని మీద
లీల గతి చల్లు దీవన ప్రాలనంగ
వేడివెలుగెంత గాగిన విన్నుమేన
నెక్కొను చెమట బొట్లు నాఁ
జుక్కలమరె

నక్షత్రములు వడగండ్లగుంపులవలెను
పటికపు టుండలవలెను, వెన్నెల కుప్ప

వలెను, చెమట బొట్లవలెను నున్నవని భావము. తిమ్మన కవిత్వమునకు పైవర్ణనము నకు సామ్యమున్నది. తిమ్మన కవిత్వము వడగండ్ల గుంపులవలె, పటికపుటుండల వలె వెన్నెల కుప్పలవలె నుండు నని ఊహింప వీలగును. పై పద్యమును చదువు నప్పుడు రఘునాథరాయలు కవిత్వమును గూర్చి చెప్పిన 'చెప్పగవలె గప్పురములం గుప్పలుగాఁ బోసినట్లు' అను పద్యము గుర్తుకువచ్చును,

కవి కావ్యములోని అన్ని పాత్రముల లోను లీనమైనను తనకు నచ్చిన తాను లోకమున కాదర్శప్రాయముగా చూప దలచిన ఒకానొక పాత్రలో సంపూర్ణ ముగా లీనమై, అందు ఆత్మీయతా ముద్ర ప్రదర్శింపకుండ నేరడు. తిమ్మన తన పారిజాతాపహరణ కావ్యములో సత్య భామ పాత్రలో లీనమై యున్నట్లు తోచును. కావ్యపీఠికలో శ్రీకృష్ణ దేవ రాయ వర్ణనలో శ్రీకృష్ణ దేవరాయలకు, శ్రీకృష్ణునకు నభేదము వర్ణింపఁబడినది. దీన్నిబట్టి యింతలి నాయకుడు శ్రీ కృష్ణ దేవరాయలే యని స్పష్టముగ చెప్ప వీల గును. సత్యభామ పాత్రకు సరిగా సరిపడు తిరుమలాంబ పాత్రను తిమ్మన గైకొని కావ్యమును శోభాయమానముగా తీర్చి దిద్దినాడు.

మహాకవి ప్రతిభకు గల ముఖ్య లక్షణ ములలో నొకటి పాత్ర నిర్మాణకౌశలము. తిమ్మన పాత్ర చిత్రణములో గడునేర్పరి. కావ్యారంభములోనే ప్రధానమైనపాత్ర లన్నింటిని ప్రవేశపెట్టును. ఈ కావ్య ములో శ్రీకృష్ణుడు, సత్యభామ, రుక్మిణి, నారదుడు ప్రధాన పాత్రలు. వీరందరిని తిమ్మన ప్రథమాశ్వాసములోనే ప్రవేశ పెట్టినాడు.

మగువల మనోభావములను మనోహ రముగ వర్ణించుటలో తిమ్మన మిక్కిలి నేర్పరి. సత్యభామ మానక్రోధ వర్ణనము లిందుకు తార్కాణములు. చెలికత్తె చెప్పగ విన్న సత్యభామ, 'వ్రేటువడ్డ యురగాం గనయుంబలె' లేచి చెప్పిన విషయాన్ని మరల మరల తలచుకొనుచు బాధపడు టయు, మధ్యమధ్యలో 'తప్పేవరిది' అను విషయమును ఆలోచించుటయు, 'పరి కింపరు తముజాడలు, తరుణుల తగులములు నమ్మదగదంద్రు మదిన్, శరదంబుద చల చిత్తులు పురుషులె పో వారి నమ్మ తోలం నె' వంటి భావమేర్పడుటయు తిమ్మనచూపిన మగువ మనోభావము మిగుల రమణీయము.

కథకు కారణము పారిజాతము. దీనికి తోడు కలహభోజను డగు నారదుని చాక చక్యము. నారదుని పారిజాత ప్రభావ ముతో నాంది పల్కి, సత్యభామ కోప గృహమున శ్రీకృష్ణుని వామపాదముతో 'తొలగంద్రోయుట'తో రక్తి కట్టి, శ్రీకృ ష్ణుడు ఇంద్రాదులతో యుద్ధము చేసి పారి జాతము హరించుటతో పరిసమాప్తి గాం చినది. కథైక్యము జరగినది. నారదుడు పారిజాతమును 'పసిండి నెత్తమ్మి చిగురు టాకునఁ బొదివి' యిచ్చుటయు, శ్రీకృష్ణు వకు 'సత్యభామ తలపున నిల్చు'టయు, నారదుని 'కన్నుసన్న' 'సత్యగరువంబికఁ జెల్ల' దని సత్యతో చెలియ నారదు డన్నట్లు తెల్పుటయు కథకు ఆయువు పట్టులై నిల్చినవి. వీనికి తోడు సత్యభామ శ్రీకృష్ణుని 'వామపాదంబునం దొలగం ద్రోయుట' లో నారదుని కలహబీజము మొలకెత్తినది.

తిమ్మన లోకజ్ఞత కలవాడు. మను ష్యుడు విరక్తి చెందినప్పుడు ఆభరణాలు తీసివేయుటయు, మంచి వస్త్రధారణ లేకపోవుటయు లోకసహజము. సత్యభా మకు జీవితముపై విరక్తి కల్గి 'మాసినచీర గట్టుకొని, మౌనముతోడ నిరస్తభూష యై' యున్నట్లు, ఆమె బాధతో నున్న ప్పుడు 'వెడవెడ గన్నుమూయు, గను విచ్చు; నగుం; దలయూచు; పాన్పుపై బడు, నుసురంచు లేమ'టయు మొదలై నవి తిమ్మన వర్ణించి తన లోకజ్ఞతను చాటుకొన్నాడు.

తిమ్మన రసపోషణమును గడు రమణీ యముగా గావించినాడు. ముఖ్యముగ శృంగారరసమును బోషించుటయం దీతనికి మిక్కిలి మక్కువ. ఇతడు హాస్యరసము, కరుణరసమును పోషించినను శృంగారమే ప్రాధాన్యము వహించును. కావ్యారంభ ముగుండి సాయంకాల వర్ణనారంభము వరకు, పురస్త్రీల వర్ణనమును, పుణ్యక ప్రకాంశమును, శృంగారరసముతో బో షించి తిమ్మన తన కవితామృతమును వెల్లువవలె ప్రవహింప జేసినాడు. తిమ్మన వీరమును పోషించుటకు చాల కష్టపడును. శ్రీకృష్ణునకు, ఇంద్రాదులకు జరగిన యుద్ధ మును సుమారు ఒక ఆశ్వాసమునకు సరి పడు పద్యములలో వర్ణించినను, అది యుద్ధములా కానరాదు. వూబంతులతో స్నేహితు లాడుకొన్నట్లుండును. తిమ్మన చేసిన యుద్ధవర్ణనమును పరిశీలించిన ఈ విషయము స్పష్టమగును.

'కినిసి బిడౌజు డాగ్నేయాస్త్ర మడరింప
నది వార్గితేజంబునందుఁ డిందెఁ
గనలి వృద్ధశ్రవు డనిలాస్త్రమేసిన
నది యదూద్వహునూర్పునందు డింద
నలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప
నది శౌరివల చూడ్కియందు డింద
నడరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు
పయికొల్ప
నది మురాంతకునాభియందు డిందెఁ
బాకదమన ముక్త పాశుపతాస్త్రంబు
హరి నిజార్ధతనువు నందు డింద
నేమి సేయవచ్చు నీశ్వరుం డఖిలాత్ము
డతని గెల్వ దనకు నలవి యగునె.'

తిమ్మన కొన్నిచోట్ల వీరమును పోషిం చినను శృంగారములా కన్పట్టును.

'వ్రేల్పుమ్రానియందు వేడుకపడు కూర్మి
సతులకోర్కి దీర్పజాలి యపుడు
హరియు హరియు బోరి రనన్యసా
జయకాంతు
నసురజీవితాపహారుగముల.'

తిమ్మన హాస్యమును మాత్రము బాగుగనే పోషించగలడు.

"బలిదనుజేంద్రు గట్టి తన పల్కుగ విందుముగాని నేడు మా చెలి యిదెపుష్ప దామకముచే నిను గట్టగ గంటి మింక నెమ్మిలం పచరింపరాదు' అనిసత్యదాసీలు మేలములాడినప్పుడు నవ్వు పుట్టించును. అట్లే నారదుడు కృష్ణునితో బనులు గొన్నప్పుడు "పొమ్మి పొమ్మని రొయిక కొంత పోవబోవ. రమ్మురమ్మని మరల మరల చేరంగ బిలిచి.'

తిమ్మన సత్యభామను ఏడ్పించిన తీరు కూడ చాల ముద్దుగామన్నది. చెలియ చెప్పగ విన్న సత్యభామ "క్రేటుపడ్డ యురగాంగనయువలె" లేచికోప గృహం బునకుబోయి "మాసినచీర గట్టుకొని, మౌనముతోడ, నిరస్తభూషయై" పొరలినది. బాధపడినది. తాలవృంతముతో విసరుచున్న శ్రీకృష్ణుని చూచి, సత్య "బావ్పకణికా తిరలీకృత లోచనాంత యైనది". మగుడ ముసుగిడగ "గొలపల దిగజాతి జాలుకొను బాష్పంబుల్" చెక్కులపైకి దిగజారెను. సత్యభామ శ్రీకృష్ణుని దూతి చివరకు "హెచ్చిన శోకద వానలంబుచే" "బాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠ వధూకలకాకలీ ధ్వనిన్" ఏడ్చెను.అందుకే నేమో తెనాలి రామకృష్ణుడు నాయికల రోదనలగూర్చి

"అల్లసాని పెద్దన అల్లిబిల్లిగ
ముక్కుతిమ్మన ముద్దుముద్దుగ ఏడిస్తే
భట్టుమూర్తి బావురుమని ఏడ్చాడని"

పరిహాసముగ పల్కినాడు. ముక్కు తిమ్మన చిత్తవృత్తి చాల లలితమైనది.

తిమ్మన కవిత్వము మృదుమధుర పదయుతమై, మనోజ్ఞ భావపటిమతో మనోహరమై, సరళమై, సహజమై యొప్పుచున్నట్లు సహృదయుల హృదయంబుల కెలుకు పడును.

—0—

# నన్నయ భారతంలోని శైశవలీలలు

— శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ.

మానవ జీవితంలో శైశవదశ పరమ రమణీయం! కల్లకపటూ లెఱుగని మనస్సులతో మసలుకొనే సమయ మది! ఒకసారి కేరింతలు, మరోసారి కేకరింతలు, ఒకపర్యాయం కలతలు, మరోపర్యాయం కలవరింతలు, కలబోసుకునే కాల మది! నవ్వుల పువ్వులు రువ్వుతూ ఉన్నట్లుండి కన్నీళ్ళ మధుస్రవంతులను, అంతలోనే హఠాత్తుగా ఉత్సాహ ఝురీతరంగాలను ప్రవహింపజేసే వాతావరణ మది! ఇట్టి అనుభూతి ప్రధానమైన ఈ శైశవ దశ, మానవ జీవితాలకు దర్పణరూపంలో వ్యాఖ్యాన ప్రాయమైన సాహిత్యంలో, విశేషించి మన ఆంధ్ర సాహిత్యంలో చోటుచేసుకుంది! ఈ శైశవ లీలాభివర్ణన వర్ణనగా ప్రబంధ పరమేశ్వరుని అసమాన సృష్టిలో సహజత్వాన్ని తొణికిపుచ్చుకున్నప్పటికినీ అంతకుముందు కవిరాజ శిఖామణి రచించిన కుమారసంభవ కావ్యంలోనూ, ఇంకనూ అంతకుముందు నానా రుచిరార్థసూక్తి నిధియైన నన్నయ భట్టారకుని మహా భారతంలోనూసముచితరీతిలో నిర్వహించబడింది! ఆంధ్ర సాహిత్యంలో ఆదికావ్యం నన్నయ భారతమైనా, అది సాహిత్యానికి శైశవ దశమాత్రం కాదు; అలాగే ఈ భారతంలో శైశవదశాలీలలు పుష్కలంగా వర్ణనాత్మక దృష్టిలో సమకూర్చబడకపోయినా, ఇందు శైశవ చేష్టా ప్రస్తావన అసలు లేకపోలేదు. ఆదికవి భారతంలో ముచ్చటగా మూడునాలుగు చోట్ల మాత్రమే ఉన్న శైశవ చేష్టా విశేషాలను విస్పష్టంచేయడమే ప్రస్తుత వ్యాసమున కుద్దిష్టాంశం!

ఆఖ్యానశైలీ ప్రధాన మైన ఆదికవి భారతంలో శైశవ చేష్టాప్రస్తావన మొట్ట మొదటగా ఆదిపర్వం దుష్యంతోపాఖ్యానంలో చేయబడింది! మొదట దుష్యంతుని గుణగణాలను వర్ణిస్తూ అతని బాల్య చేష్టలను కవి యిట్లు తెలిపెను :—

'బాలహరిణముల౦ బట్టెడు
లీలను విషమాటవీ చలిత కేసరి శా
ర్దూలేభ శరభముల౦ దన
బాలత్వమునంద యొగిఁ బట్టుచు
మరియున్'

ఇది అమూలకము.

పిమ్మట ఈ ఉపాఖ్యానంలోనే 'శకున్త్యా నిర్వర్తిత జాత కర్మాది క్రియాకలాపుఁడైన శాకుంతలుని నానా శైశవ క్రీడలను కవి యిట్లు ప్రస్తావించెను :—

'అమితోగ్రాటవిలోన౦ గ్రుమ్మరువరాహ వ్యాళ శార్దూల ఖ
డ్గమహేభాదుల౦ బట్టి తెచ్చి ఘనుఁడై
కణ్వాశ్రమోపాంత భూ
జములందోలిన కట్టుచుం బలిమిమై
శాకుంతలుం డొప్పెవ
న్యమృగేభంబుల నెక్కుచుం దగిలి నా
నా శైశవ క్రీడలన్॥

దీనికి మూల మిది :—

షడ్వర్ష ఏవ బాలః సః
కణ్వాశ్రమపదం ప్రతి
వ్యాఘ్రాన్ సింహాన్ వరాహాంశ్చ
గజాంశ్చ మహిషాంస్తథా
బద్ధ్వావృక్షేషు బలవాన్
ఆశ్రమస్య సమన్తతః
ఆరోహన్ దమయంశ్చైవ
క్రీడంశ్చ పరిధావతిః
....................ఇత్యాది

ఇచటి శైశవ చేష్టనుబట్టి మహాసత్త్వ విషయంలో భరతుఁడు తండ్రియైన దుష్యంతుని పోలికను పుణికి పుచ్చుకొనెనని తెలుస్తోంది! భరతుఁడు తండ్రికి తగిన కుమారుఁడని తెలుపుటకును, దేశనామము తన పేరిట వెలయునట్లుగా పరిపాలించుట కర్హమైన లక్షణములు కుమారుఁడైన భరతునకు తండ్రి యొద్దనుండి సంక్రమించెనని వివరించుటకై పరాక్రమోచితమైన దుష్యంతుని బాల్యవర్ణనం కవి చేయడం జరిగింది!

ఇక భరతుని విషయం :_ మూలానువాదముల రెంటనూ బాలభరతుని పరాక్రమ సంబంధమైన వీరోచితమై శైశవ చేష్ట అభివర్ణితమైంది! మూలంలో భరతుఁడు నానా శైశవ క్రీడలను చేయునప్పటికి ఆరు సంవత్సరముల వయస్సుగలవాఁడని తెలుపఁబడెను. అనువాదమున నన్నయ ఈ విషయమును స్పష్టంగా చెప్పక పాఠకుల ఊహకు వదలెను. మూలంలో భరతుఁడు కేవలం 'బాలః' అని పేర్కొనఁబడగా, అనువాదంలో నన్నయ భరతుని 'శాకుంతలు'డని పేర్కొనెను. ఇట్లు పేర్కొనఁబడుటలో కథాంశస్ఫూర్తి యొకటి గమనార్హం; భరతుఁడు జన్మించి ఆరుసంవత్సరములైననూ దుష్యంతుఁడిదివరకు తానన్నమాట ప్రకారము శకుంతలను తన రాజధాని కింకను రప్పించుకొనలేదని సూచన; కావుననే భరతుఁడింకనూ లోకులదృష్టిలో దౌష్యంతి కాలేదనియు, శాకుంతలుఁడుగనే ఉన్నాడనియు కవి భావన; ఇట్టి కథాంశస్ఫూర్తితోఁగూడిన విశేషణ పదప్రయోగము నన్నయ ప్రసన్న కథలోని అర్థయుక్తి సంబంధమైన చమత్కారము. ఇంతకూ నన్నయ ఒక్క విశేషముద్వారా సమగ్ర కథాస్ఫూర్తిని పాఠకులకు గలిగింపజేయుట ఇందలి విశేషం :

ఇక అనువాదమున భరతుని వీరోచితమైన శైశవ క్రీడను తదనుకూల తేజస్స్ఫూర్తిమంతమైన మత్తేభవృత్తము నందభివర్ణించుట అనునది ఒక ఛందశ్శిల్ప రచనా విశేషమై నన్నయ ప్రసన్న కథాకలితార్థయుక్తిని అక్షరమైన రమ్యతతో చాటుచున్నది; మూలంలో భరతుడు మృగములను పట్టి బంధించి ఉంచినది ఎవరి ఆశ్రమము లందలి భూజములనో స్పష్టముగా పేర్కొనబడలేదు; కాని నన్నయ ఇట కణ్వాశ్రమోపాంత భూజములకని పేర్కొని వెనుక వర్ణించిన కణ్వాశ్రమగత శాంతరసస్ఫూర్తి గల్గిన 'శ్రవణ సుఖంబుగా సామ గానంబులు చదివెడి శుకములఁ జదువు తగిలి......' అనుపద్యమును పాఠకులకు జ్ఞప్తికి తెచ్చెను. ఇట్లు జ్ఞప్తికి తెచ్చుటలో ఒక ప్రయోజనము గలదు; ఆ ప్రయోజన మిది:_ అంతటి శాంతరసమునకు స్థానమైన కణ్వాశ్రమమునుగూడ తన శైశవ క్రీడలచే మృగములను బాధించు రూపములో నచటి వాతావరణ పరిస్థితినే భరతుడు మార్చగల్గెనను విషయము తెలుపుట; మరియు భరతుని వీరోచితమైన శైశవ క్రీడాధిక్యమెట్టిదో అభివ్యక్తమగుటయు కథాగతి ప్రయోజనమే! కావుననే అచటి మునులు భరతుని చేష్టలను గమనించి సర్వదమనుఁడను పేరును వాని కేర్పఱచిరి; ఈ విషయము మూలానువాద గ్రంథముల రెంటను చెప్పఁబడెను. ఇట్టి కథాగతి ప్రయోజనములతో, భావానుకూలచ్ఛందః ప్రయోగ వైశిష్ట్యముతో ఈ భరతుని శైశవ చేష్టా ప్రస్తావన విశిష్టమై శారదరాత్రివంటి నన్నయ కవితకే అక్షర రమ్యతను సంతరించినది.

ఇక తరువాతి శైశవ చేష్టా ప్రస్తావన కురుపాండు కుమారుల బాలక్రీడా ఘట్టమున సుమారు మూడు నాలుగు పద్యములలోఁ గావింపబడెను. ఇందెక్కువగా భీమసేనుని పరాక్రమాద్ధత్యమునకు చెందిన క్రీడావిశేషములే.

'గెలుపునెడ, నేయునెడ వడిఁ
బఱచునెడం బెనఁగునెడ నపార
బలంబుల్
మెఱయునెడ భీమునకు నం
దొఱుఁగీడ్వడఁ దొడఁగి రుద్ధతులు
రాజసుతుల్॥

......' ఇత్యాదిగా వర్ణితములయ్యెను.

మూలమునందునుగూడ

జవే లక్ష్యాభిహరణే
భోజ్యే పాంసు వికర్షణే
ధార్తరాష్ట్రాన్ భీమ సేనః
సర్వాన్ స పరిమర్దతి॥'

ఇత్యాదిగా చెప్పబడెను;

ఇచటి శైశవచేష్టాప్రస్తావనలో భావిభారత కథాబీజావాపనము గావింపబడెను. భీముని పరాక్రమ సంబంధములైన చేష్టలచే దుశ్శాసనాదులు బాధితులైరి, కావుననే తరువాతి వచనంలో దుర్యోధనుఁడు శకుని దుశ్శాసనాదులతో భీమవధ కుపాయము విచారించెనని చెప్పబడెను. ఇంతకూ కురుక్షేత్రయుద్ధము జరుగుటకు హేతుభూతమైన అంశంగా ఇచటి భీముని శైశవచేష్టా ప్రస్తావన గావించుట అనునది నన్నయగారి ప్రసన్న కథాకలితార్థ యుక్తిలో, ఒక భాగం! భీముని క్రీడలను వర్ణించుటలో స్వల్పాక్షర పరిమితమైన అచ్చతెలుఁగు పదములనే సాధ్యమైనంత వరకు వ్యస్తమైన ధోరణిలో "గెలుపునెడ నేయునెడ..." ఇత్యాదిగా ప్రయోగించుటనుబట్టి కౌరవాదులను పరాక్రమ విషయమున నలయించుటలోని భీముని అలవోక తనము స్పష్టమగుచున్నది. మరియు భీముని పరాక్రమ సంబంధమైన బాల క్రీడలను విస్తృతపఱచుటలో సహజముగా పదవిస్తృతిగల సీసపద్యము నుపయోగించుటలో భావానుకూలచ్ఛందః ప్రయోగ

వైశిష్ట్యం గల దనవచ్చును. ఆపద్య మిది:

కూడిజలక్రీడలాడుచోఁ గడఁగియా
  ధృతరాష్ట్రు తనయులనతులశక్తి
లెక్కించియుఁ బదుండ్ర నొక్కొక్క భుజమున
  నెక్కించుకొని వారియుక్కడంగ
గ్రుంచఅనీటిలోముంచుచు నెత్తుచుఁ
  గాలించి తీరంబుచేరఁజెట్టుఁ
గోరిఫలార్థులైవారలయెక్కిన
  మాకుల మొదలుల వీకబట్టి
వడఁగదల్చుఁ బండ్లు దడఁబడువారల
  తోన ధరణిమీఁదఁ దొరఁగుచుండ
నిట్టిపాట గాడ్పుపట్టిచే దుశ్శాస
  నాదులెల్ల బాధితాత్ములైరి॥

ఇట్టి కవితావిశేషములు నన్నయప్రసన్న కథాకలితార్థయుక్తిలో భాగము లే యగును.

ఇక చివరి శైశవచేష్టాప్రస్తావన ఆది పర్వంలోనే బకాసురవధకు ముందు, బ్రాహ్మణ వేషములతో పాండవు లుం టున్న ఇంటివారికి తాము బకాసురున కాహారము కావలసిన వంతు రాగా, వారు దుఃఖించుచు "నేను వెళ్ళెదనన్న నేను వెళ్ళెద" ననుకొనుచుండగా, వారిపిల్ల వానినిగూర్చి కవి పల్కెడి విషయమున ఇట్లు గలదు :-

"...కూతుం గౌగిలించుకొని యేడ్చు చున్న వారల కన్నీళ్లు తుడుచుచు

"బాలకుండొక కొండొక కోలచేతఁ
బట్టికొనియేనరక్కసుఁ గిట్టిచంపి
చులుకవత్తు మీరేడ్వగా వలవదనుచుఁ
గలయనూరార్చెఁ దన తొక్కుపలుకు లొప్పు"
వానియవ్యక్త వచనంబులు వినియందఱు
  నేమ్పడిగిన నయ్యవసరంబున..."

దీనికి మూలమిట్లు గలదు :-

తతః ప్రరుదితాన్ సర్వాన్
  నిశమ్యాథ సుతస్తయోః
ఉత్ఫుల్ల నయనో బాలః
  కల మవ్యక్త మబ్రవీత్॥
మారోదీ స్తాత ! మా మాత
  ర్మాస్వ స స్త్వమితి బ్రువన్
ప్రహసన్నివ సర్వాంస్తా
  నేకైకం సోపసర్పతి॥
తతః స తృణమాదాయ
  ప్రహృష్టః పున రబ్రవీత్
అనేన తంహనిష్యామి
  రాక్షసం పురుషాదికమ్॥
తథాపి తేషాం దుఃఖేన
  పరీతానాం నిశమ్య తత్
బాలస్య వాక్య మవ్యక్తం
  హర్షం సమభవత్ మహాన్॥

మూలంలో బాలుఁడు మారోదీస్తాత!... తల్లీ ! తండ్రీ ! సోదరీ ! మీ రేడ్వవల దని చెప్పును. కాని అనువాదమున బాలుఁడు వారివారి కన్నీళ్ళను తుడిచిన చేష్టమాత్రమే గలదు. ఇచట చిన్నపిల్ల వానిచే మాటలు పల్కించడం కన్న చేష్టలు చేయించడంలోనే పాఠకుల నాకర్షించేశక్తి సహజంగా ఉందనిపిం చును.

దీనివలన ఆపిల్లవాని అమాయికత్వం కరుణరసస్ఫోరకమైన ధోరణిలో అభి వ్యక్త మాతుంది. బాలకుని తొక్కు పలుకులకు అనగా అవ్యక్తములగుమాటల కనుకూలమైన అలఁతి అలఁతి పదముల సంధానము పైని పేర్కొనబడిన తేటగీతి పద్యంలో గలదు. బాలకుని స్వచ్ఛహృద యమునకు ప్రతిబింబమైన అచ్చతెలుఁ గిట సాధ్యమైనంత వరకు ప్రయుక్త మైనది, బాలకుని హృద్భావమున కను కూలమైన తేటగీతిచ్ఛంద మిచట ప్రయో గింపఁబడుట విశేషము. ఈశైశవచేష్ట బాలకుని అమాయికత్వమునకు చిహ్నమై హాస్యప్రవృత్తి రూపమునం దారబ్ధమై, కరుణరసస్ఫోరకముగా విశ్రాంతి నొంది నది. బాలుని అవ్యక్త వచనములకు వా రానందమును చెందిరట ! ఇదియు కరుణ రసస్ఫోరకమే ! అనగా ఆ యింటిలోని పెద్దవారా బాలుని మాటలకు ఏడ్వలేక నవ్వి రనుట ! ఇందలిభావము హాస్యాత్మ కమైనను ఏతత్సంబంధమగు భావనలో పాఠకుల హృదయాలను బరువెక్కింపఁ జేయు దయార్ద్రసామృత తరంగాలు అనం తంగా గలవు. ఉత్ఫుల్లనయనుఁ డని బాలుని మూలమున వ్యాసుఁడు వర్ణిస్తే నన్నయ ఆబాలునికి ఏవిశేషణమూ వాడ లేదు. ఎందుకంటే ఆసమయంలో కవి యైనవాడు పాఠకులదృష్టికి తీసికొని రావ లసినది ఆబాలకుని చేష్ట గాని వానిరూపు రేఖలుకావు గదా ! "ఏన రక్కసు గిట్టి చంపుదు ననుటలో "నేను" అను శబ్దమును ఏవకారపూర్వకముగా (అవ ధారణాత్మకముగా) అనగా "నేనే సంహరించెదను, ఇతరు లవసరము లే" దను అర్థము వచ్చునట్లుగా కవి ఉపయో గించుటను బట్టి ఆ బాలకుని అమాయి కత్వంతో కూడుకొన్న శౌర్యం ద్యోతక మాతుంది. ఇట్టి సర్వసహృదయహృదయా వర్జకమైన శైశవచేష్ట యావదాంధ్ర సాహిత్యప్రపంచంలో మరి న భూతో న భవిష్యతి ! అక్షరముల రమ్యతతో అక్షరమైన రమ్యతనందుకున్న నన్నయ భారతంలోని ఇలాంటి శైశవ చేష్టా ఘట్టాలు గోదావరి గలగలా పాటేంత వరకూ పాఠకుల హృదయ కుహరాల్లో మనోహరాలై చిరంజీవాలై నిల్చియుం టాయి !

—:0:—

# శిల్పదర్శనం.

## ఒక విహంగావలోకనం.

– శ్రీ కపిలవాయి లింగమూర్తి.

శిల్పవాచకం పూర్వం శిలాకళకే రూఢంగాని నేడదియోగరూఢం. 'శిల్పం నిపుణకర్మస్యాత్' అనే న్యాయాన్నను సరించి కావ్యశిల్పం, వాస్తుశిల్పం. అని అనేకకర్మల కదినైపుణ్యతా వాచకంగా చేర్చబడుతుంది. శిల్పశబ్దానికి నిఘంటువు 'శీల్యతే అభ్యస్యతే ఇతి శిల్పమ్' అని. శీలశబ్దానికి 'ఉపధారణే' అని, దానికి 'అభ్యాసః' అని అర్థాలిచ్చింది. ఇవిగాక దీనికి 'శిలసమాధౌ' అని మరోవ్యుత్పత్తి కూడా ఉంది. సమాధిశబ్దంతపస్సంబంధి. దానికి మనస్సు నేకాగ్రం చేయటం, సౌఖ్యాన్నిపొందటం అనే రెండర్థాలున్నాయి. సాధకునికి మన స్సేకాగ్రమైనపుడు బ్రహ్మానందసౌఖ్యం సిద్ధిస్తుంది కాబట్టి శిల్పంగూడా ఆవిధంగా ఏకాగ్రమైన మనస్సులో సాధింపదగిందని దాని వల్ల బ్రహ్మానందసదృశసౌఖ్యం లభిస్తుందని పైవ్యుత్పత్తుల తాత్పర్యం.

లోకంలో ఏవృత్తులయినాసరే నిరంతరాభ్యాసంచేతపాఠకునిచేతిలో కళగా మారుతుంది. అలా వృత్తులన్నీ కళలుగా చతుష్షష్టికళలు శిల్పంగా మారేఅవకాశ మున్నా కళనే జీవనోపాధిచేసికున్నపుడందులో వ్యాపారసరళి పెరిగి కళాధర్మం నశించే అవకాశం ఉంది కాబట్టి ఏవృత్తికైనా ఆత్మానందం ప్రధానమైనపుడే అది కళగా రాణిస్తుంది. శిల్పంగా నిర్వహించినపుడే దానిలో ఆత్మానంద ముంది. అందుచేతనే కళాకారులు తరచుగా ఆకలిదప్పు లెరుగకుండా పనిలో లీనంగావటం చూస్తుంటాం.

ద్రౌపది సైరంధ్రిగా విరాటుని అంతఃపురంలో ప్రవేశించేఅపుడు తాను కలప మలదటం, తిలకాలుదిద్దటం, ఎత్తులు, హారాలుగ్రుచ్చటం మొదలైన శిల్పాలలో నేర్పుగా మెలగగల ·నని చెబుతుంది. ఆమె చెప్పినదాన్నిబట్టి గంధంపూయటం గూడా శిల్పమేనా అని సందేహం కలగక మానదు. కాని ఏపనిని ఏవిధంగా కళాత్మంగా నిర్వహించాలో అందరికీ చేతగాదు.

పూర్వం ఒకరాజుగారి దగ్గరకు ముగ్గురు విద్వాంసులు వెళ్ళి మహారాజా! నేను వంటపండితుడను, నేను తిండిపండితుడను, నేను నిద్రపండితుడను అని చెప్పుకున్నారు. అపుడురాజు సంభారశాలనుండి బియ్యం పప్పువగైరా సరంజామా యిప్పించి వంటపండితునిచే వంట చేయించాడు. ఆపండితుడు వంట ముగిసిన తరువాత దానిలోనుండి కొంత తీసి పెరటిలో ఓగుంజమొదట ఓగుంత దీసి కొంతపూడ్చి వారందినాల తరువాత దాన్ని చూడమన్నాడు. తరువాత రాజు ఇద్దరితో కలిసి భోజనంచేశాడు అపుడు భోజనంవేళ తొలికబళం నోటపెట్టుకోగానే తిండిపండితుడు ఆబియ్యం ఏలాటి పొలంలో ఎన్నిదినాలకుపండిందీ, దానిలో కలుపుతున్న పప్పు ఏనేలలో పండింది, చేతిపైవేసికున్న నేతిని ప్రసాదించిన ఆవులు ఏలాటి గడ్డిమేసింది వివరాలన్నీ తప్పకుండా చెప్పివేశాడు. ఇక నిద్రపండితునివంతు వచ్చింది. రాజుగారు తన పరుపు వేయించాడు. అతడు దానిపై పండి ఓపర్యాయం యిటూఅటూ పొర్లి రాజుగారిని పిలిచి, పరుపు నోచోట వ్రేళ్లతో పట్టుకుని యిక్కడ దీనిలో మనిషి వెంట్రుక ఉంది చూడండి అన్నాడు రాజుగారు పరుపు అక్కడ విప్పించి చూసి ఆశ్చర్యపడ్డాడు. వారం దినాల పిమ్మట పెరట్లోకి వెళ్ళి చూస్తే అన్నం పాతినగుంజకు పచ్చిదనంఎక్కి చిగురుచాయ కనిపించింది. రాజపుడు వారివారి ప్రతిభల కబ్బురపడి తగినపారితోషికా లిచ్చి పంపాడు

ఒకప్పుడు మరోరాజుగారి దగ్గరకు ఓ సొన్నారి గురిగింజెత్తు బంగారంతో వెలగకాయంతపొల్ల ఊదుకొని వెళ్ళి చూపించాడు. అపుడు రాజుగారతని పనితనానికి కాశ్చర్యపడి మంత్రిని పిలిచి అతనిని ఏను గెక్కించి ఊరేగించమని చెప్పాడు. మంత్రిగారు దేవిడీజనం అంతా అతని నేను గెక్కించి ఊరేగిస్తుంటే ఆ దారిలో ఓ తగరం అతుకులవాడు కనబడ్డాడు. వాడా ఉత్సవంచూసి ఆయన చేసిన ఘనకార్యమేమిటని అడిగాడు. దేవిడీజనం అతడు చేసినపని చెప్పారు. అపుడాఅతుకులవాడు ఏదీ ఆవెలగపండంత పొల్ల నేనోపర్యాయం చూస్తాను. ఆలాగే ఏనుగుపైనుండినాచేతిలో వేయించండి అని అడిగి, వారు దాన్ని క్రిందికి వేయగా దాన్ని చేతికి బదులు తనపటకారుతో ఏమాత్రం చొట్టపడకుండా పట్టుకున్నాడు. ఆవింతిను భటులు వెంటనే రాజుగారికి విన్నవించారు. రాజది విని ఏనుగుపైనుండి అగసాలిని దించి తగరంపనివాని నెక్కించమన్నాడు. మన దేశంలో ఈవిధంగా తమవృత్తుల్లో నిపుణత సాధించిన వారికథలకు, తాడెక్కే వారిని తలదన్నే కథలకు కొదువలేదు.

కథలవరకూ పోనక్కరలేదు. స్థానం నరసింహారావుగారు ఆడవేషాలు వేసే

కాలంలో వారు చింతామణి వేషంలో ఆకులకు సున్నం రాయటం చూసిన ఓ పెద్దమనిషి తనభార్యామణితో ఆకులకు సున్నం అలా రాయటం నేర్చుకోమని రోజు ఓ తమలపాకులకట్ట పట్టుకువచ్చి యిచ్చాడట. స్థానంవారినటనా శిల్పం అంతగొప్పది. 'శిలసమాధా' అని ఉంది గాబట్టి ఈలాటివి దాని కుదాహరణాలు. ఏకాగ్రచిత్తంతో తపఃకర్మవలె నిర్వహించే ఏపనిఅయినా శిల్పమే అవుతుంది.

అయితే నేడు లోకంలో కర్మలన్నీ శిల్పంగా గాక లలితకళలు మాత్రమే శిల్పంగా వ్యవహరింపబడుతున్నాయి.

జగత్తులో ప్రథమశిల్పి సృష్టికర్తయైన కార్యబ్రహ్మ సృష్టిలోని గ్రహనక్షత్రాలను, భూమిమీది పర్వతపంక్తులను, నదీనదప్రవాహాలను, సముద్రాల ఆటుపోటులనుఅధ్యయనంచేసినపుడవి ఓక్రమంలో సాగిపోతున్నాయని వానిలో విరాట్ శిల్పం గోచరిస్తుంది. సామాన్యుడంత వరకు పోనక్కరలేదు. తాను ప్రతిదినం చూసే వృక్షలతాదులను మానవులను పరిశీలిస్తే చాలు.

చెట్లలో ఆకులఅమరిక ఒకదానిలాగ మరోదాని కుండదు. ఒకతీగ ప్రాకినట్టు మరోజాతితీగ ప్రాకదు. ఒకపాద పూచినట్లు మరోటిపూయదు. మానవుల్లో అందరు నొకటేఅయినా ఒకరు నడచినట్లు మరొకరు నడవరు. ఒకరు మాటాడినట్లు మరొకరు మాటాడరు. ఒకరునవ్వినట్లు మరొకరు నవ్వరు. ఎవని ముద్ర వాని స్వతంత్రం. ఈవిధంగా చరాచర సృష్టిలో అనంతవైవిధ్యముగల శిల్పం సాక్షాత్కరిస్తుంది. జగత్తులో శిల్పంలేని స్థలంగాని కాలంగానిలేదు. అది రూపంలోను, భావంలోను, భాషలోను అంతటా నిండిఉంది గాని దాన్ని ద్రష్ట తప్ప అందరూ గమనించలేరు. గమనించి ఆరాధించలేరు.

వాల్మీకిమహర్షికి ప్రస్రవణపర్వతంపై గల నది స్త్రీలా కనిపించింది. కాళిదాసుగారి కామ్రకూటం భూదేవి స్తనంవలె భాసించింది. భారవికి గాలికి లేచిన నళినీపరాగం హిమవంతునికి కనకమయాతపత్రంపట్టినట్లు కనిపించింది. రామరాజభూషణునికి వనంలోని మావిగున్న మన్మధుని రథంలా అనిపించింది. సూరనకు సముద్రంపైవ్రాలిన మేఘం ప్రియునిపై వ్రాలిన యువతిని తలపించింది. సృష్టిలోని యిటువంటి శిల్పాన్ని దర్శించటానికి దైవదత్తమైనప్రతిభాచక్షు వవసరం. అదిగలవారే లోకంలో కవులు, కళాకారులు, శిల్పులు, అవుతారు. తాము దర్శించిన సృష్టిలోని భావసౌందర్యాన్ని కవులు శబ్దబద్ధంచేస్తే పలుకుల కందనిదాన్ని గాయకులు స్వరంలో, స్వరానికందనిదాన్ని చిత్రకారులు వర్ణసమ్మేళనంలో వర్ణానికందనిదాన్ని నాట్యకారులాంగిక విన్యాసాల్లో ప్రదర్శిస్తారు. ఇక శిల్పులైనవారురూపసౌందర్యాన్ని శిలలో దీర్చి ఆరాధనీయంచేస్తారు. అలాటి శిల్పవిశేషాలన్నిటిని దర్శనాచార్య శ్రీకొండూరి వీరరాఘవాచార్యులు తమ శిల్పదర్శనంలో అగస్త్యుడు సముద్రాన్నివలె ఆపోశనంపట్టి చూపించారు.

జగత్తులో శిల్పాన్నిదర్శించటం,దర్శించినా దాన్ని పరిశీలించటం అందరిచేత నయ్యే పనిగాదు. అందుకు సునిశితమైన ప్రజ్ఞ, దర్శించినదాన్ని చెప్పటానికి సమర్థమైనవాక్కు, చెప్పినదాన్ని నిరూపించటానికి విపులమైన శాస్త్రపరిచయం అవసరం. ఈకృతికర్తకు సంస్కృతంతో పాటు దర్శనరచనకు చాలినంత వేదవాఙ్మయ పరిచయం శిల్పశాస్త్రంలో కూలంకష పరిజ్ఞానంఉన్నాయని పుస్తకం చెబుతుంది.

గ్రంథరచన చాలమంది చేస్తారుగాని అనేకులకు తమరచనా విషయంలో పటిష్ఠమైన ఓప్రణాళిక ఉండదు. కావ్యవిషయంలో అది ఏలాఉన్నా శాస్త్రగ్రంథ విషయంలో చాలా అవసరం. వీనిలో విషయవిభాగం స్వయంపూర్ణమై అష్టాధ్యాయి సూత్రాలవలె స్థానప్రాధాన్యం గూడ కలిగిఉండాలి. అపుడే కృతికి ఓ ఆకృతి వస్తుంది. ఆచార్యులవారీదర్శనంలో ఆలయనిర్మాణాన్ని చెబుతూ అందులో విరాణ్మూర్తి నద్భుతంగా చూపించారు. దానితోపాటిరువదైదు శీర్షికలుగా విభక్తమైన ఈకృతిని పంచవింశతితత్వాత్మకమైనఈదేహానికి విషయప్రణాళికనుబట్టి మానవజీవితానికి గూడ సంకేతం చేశారా అనిపిస్తుంది.

ప్రపంచంలోనికి వచ్చిన తరువాత మానవుడు మొదటకొంతకాలం ప్రకృతి-వింతలు విలాసాలు చూస్తూ గడిపాడు. ఆతరువాత సౌందర్యోపేతమైన ఆలయాలు నిర్మించి వానిలో తన ఆరాధ్యమూర్తిని ప్రతిష్ఠించి పూజించాడు. అనంతరం అది విడిచి యాంత్రికనాగరికతలో పడిపోయి మళ్ళీ యిపుడిపుడే వెనుదిరిగి తన ప్రాచీన సంస్కృతి చిహ్నాలను చూసుకుంటున్నాడు. ఇది నేటిమానవుని స్థితి.

ఇక ఈదర్శనాన్ని చూడండి. కర్తమంగళాచరణం పిమ్మట విరాట్ శిల్పమైన సృష్టిని, నామరూపవిలాసాది ప్రకరణాలతో ఆరంభించి తరువాత పాఠకులకు శిల్పావగాహనార్థమై భావవాఙ్మయరూపశిల్పాలచే వివరించి స్థాపత్యవేదస్వరూపాన్ని తెలిపి శిల్పిబ్రహ్మలనుజూపి, వారి నాలయప్రవేశం చేయించాడు. ఆలయంలోపలికి వెళ్లినతరువాతఅక్కడ ప్రతిమాసౌందర్య లక్షణంచెప్పి లింగతత్వస్వరూపం చూపి వివిధదేవతామూ భేదాలను వివరించి తరువాత బయటి గొనివచ్చి యంత్రశిల్ప ప్రపంచంలో వింతలను, అక్కడి వాస్తు విశేషాలను

లోకప్రవృత్తిని జూపి ఈయాత్ర పవ సంహారంగా ఇక ఓపర్యాయం వెనక్కి మలపి ప్రాచీనశిల్పక్షేత్రవైభవం మళ్ళీ చూపించాడుకాబట్టి ఈరచనాక్రమంలో మీకు నేటి మానవునిస్థితి స్ఫురించటం లేదా ?

ఇక విషయాన్ని చిత్తగించండి! గ్రంథంలో ప్రతిమా లక్షణ సౌందర్య ప్రకరణంలో గ్రీకు, భారతీయ శిల్పభేదాన్ని స్పష్టపరచి, భారతీయ శిల్పాన్ని కావ్య నాయికాసౌందర్యంతో సమన్వయం చేశాడు. తాళప్రమాణంలో ఉత్తమ మధ్యమాధమ ప్రమాణాలు చెప్పి మయ మతంలోని నవతాళప్రమాణాన్ని దానిలోని నూటెనిమిది సంఖ్యను చక్కని తాత్విక సమన్వయంతో చెప్పాడు.

లింగతత్వప్రకరణంలో శ్రీచక్రంలోని ందు త్రికోణాలు ప్రకృతి పురుషులకు ంకేతాలని, బిందుస్వరూప ప్రస్తారమే ంగరూప మని, శివుని నాగాభరణం ండలినీ శక్తి చిహ్న మని, లింగం కేవలశివసంకేతమేకాక పాండురంగనికి ూడ సంకేత మని, అది త్రిమూర్త్యా ్మక మని యిటువంటి అనేక వైదిక ాంత్రికరహస్యా లుద్ఘాటించి, వాని ుక్క వివిధస్వరూపాలను చక్కగా, వేచన చేశాడు.

మూర్తిభేదాలలో విష్ణువు, నర ంహ, గణపతి, శివ, లక్ష్మీ మూర్తులను ్రమూర్తులను వివరించాడు. చేతుల్లో ుధాలు మార్చటంవల్ల విష్ణువు కేశ లక్ష్మి ఎనిమిదిగా, శివుడు అరువదినాలుగుగా, దుర్గ తొమ్మిదిగా మారుతారు. గణపతికి ఏబదియారు రూపాలట గాని వీరు ముప్పదిమాత్రమే చెప్పారు. మూర్తులను చెప్పటమేకాక అవి యెక్కడెక్కడున్నది వివరాలుగూడా యిచ్చాడు. సింహాచలంలో ముప్పది నరసింహభేదాలు భద్రాచలంలో లక్ష్మీదేవి ఎనిమిదిరూపాలుఉన్నాయట. ఈ సందర్భంలో ఆచార్యులవారు శాస్త్రాల్లో ఇంతవరకు కనిపించని ప్రసన్నలక్ష్మీ పరిణామలక్ష్మీ గణేశాని మొదలైన నూతనమూర్తులను గూడ చెప్పటం వారి శిల్ప పరిశీలనకు తార్కాణం. వారు దక్షిణదేశంలోని ప్రసిద్ధాలయాలన్నీ దాదాపుగాచూచారు కాబట్టే ఈ విషయాన్ని ఇంతసాధికారంగా చెప్పగలిగారు.

ఈశ్వరు డొక్కడేఅయినా అతని విభూతులు గుణాలు అనంతంగాబట్టి శివ విష్ణు రూపాలలో ఏర్పడిన ఈ భేదాలు ఆయాపేర్లతో వ్యవహరింపబడే యీశ్వర విభవ ప్రవృత్తు లేమో! భౌతికమైన మానవదేహాన్ని పోషించేశక్త్యాలుయిరవైనాలుగు పోషణకర్త విష్ణువు రూపాలు ఇరవైనాలుగు. మానవు లనుభవించే ఐశ్వర్యాలు ఎనిమిది,లక్ష్మీదేవికిరూపాలు ఎనిమిది. ఈవిధంగా మనదేవతాభేదాలకు ఆధ్యాత్మికసమన్వయం కనిపిస్తుంది.

దేవతామూర్తుల తరువాత యంత్ర శిల్పంలోసమరాంగణ సూత్రధారంలోని యంత్రమయ గజాశ్వపరిచారికాది వివిధ విచిత్ర యంత్రాలను, వివిధవిమాన భేదాలను పేర్కొని భారతీయ యంత్ర స్థాపత్యము పూర్వ మెంతగొప్పగా నుండెనో వివరించారు. శిల్పము-వాసుప శిరిక లో ప్రతిభోదాహరణాలు చూపి ఆభాగంలో తెలుగు దేశంలోని చిత్రకారు లందరినీ పేర్కొన్నారు.

మనదేశంలో వైదికమతాలతోపాటు జైనబౌద్ధాలుగూడా వెలిశాయి. అవి చార్వాకాలైనా ప్రతిమారాధన విషయంలోఆస్తికమతాలకోవలోనివేగాబట్టి ఆచార్యులవా రిందులో ఆలయాలతో పాటు బౌద్ధులచైత్యాలను, స్థూపాలను గూడా వివరించి జైన బౌద్ధమూర్తులలో గూడఏర్పడిన పరిణామవికాసాలను చెప్పవలసింది. మనపంచాయతనంలో గూడ అర్కుడొకడు. సూర్య ప్రతిమలు మన దేశంలో చాలా ఉన్నాయి. ఇక్ష్వాకుల నాటి స్కంధ మూర్తులు గూడా ఉన్నాయి. ఇవి ఆచార్యుల వారిదృష్టిని తప్పించుకున్నాయి ఎందుకో! అయినా ఈచిన్నలోపం యిందులో వెలితిగా కనిపించదు.

ఇది దర్శనంకాబట్టి కృతి మొదట గహనమైన సృష్టితత్వాన్ని విరాట్పురుషతత్వాన్ని వివరించి దీనికిదర్శనత్వాన్ని, ప్రతిప్రకరణాంతంలో సందర్భోచితమైన వివిధకవుల పద్యాలుద్ధరించి కావ్యత్వాన్ని, యిచ్చి గ్రంథాని కొక నిండైన రూపం సంతరించారు. దీన్ని చదివినపాఠకునికి ఒకదర్శనాన్ని చవిచిన అనుభూతి తప్పక కలుగుతుంది.

ఇంతటి పరిశ్రమకు కేవలం ఒక్క ఓపికే చాలదు. అందుచేత నే గాబోలు శ్రీవేలూరి శివరామశాస్త్రి గారు వీరిని గూర్చి చెబుతూ ఆనందకుమారస్వామి ఓ. సి. గంగూలి మొదలైనవారికోవకు చెందినవారని అన్నారు.

# శ్రీశ్రీ కవిత - అధివాస్తవికత

— శ్రీ కవెరపు వేంకట్రామయ్య, ఎం. ఏ.

ఆధునికాంధ్ర కవిత్వంలో ఒక ఉద్యమంగా ప్రజ్వరిల్లి పలువురి దృష్టిని ఆకర్షించిన అతినవ్య కవితా ధోరణులలో 'సర్రియలిజమ్' (Surrealism) ఒకటి. తెలుగు కవితారంగంలో ఈ ప్రక్రియ స్వయం సముద్భూతము కాదు. ఆంగ్ల కవితా ప్రభావంతో ఇది తెలుగులో ప్రవేశించినది. అసలు ఈకవితోద్యమానికి పుట్టినిల్లు ఫ్రాన్సు. ప్రథమ ప్రపంచసంగ్రామ ఫలితంగా ప్రపంచ రాజకీయాల్లోనే కాక మిగిలిన అన్నిరంగాల్లోనూ, చివరకు కళారంగంలో సహితం అనూహ్యమైన పరిస్థితులు చోటుచేసికొన్నాయి. పెట్టుబడివారీవ్యవస్థ ప్రబలి యాంత్రికనాగరికత వెర్రితలలు వేయనారంభించింది. నగరజీవితం వ్యక్తికి, సంఘానికి, మధ్య తీవ్ర అఘాతాన్ని ఏర్పరచింది. సమాజపు టడవిలో మనిషి దిక్కులేనివా డైనాడు. వ్యక్తి పరిస్థితి యిలావుండగా, మరోవైపు అత్యంత సమర్థంగా పురోగమించి ప్రకృతిపరిస్థితులనే తన అధీనంలోకి తెచ్చుకుంది శాస్త్రవిజ్ఞానం. దీనితో తాను నిర్మించిన యంత్రానికి తానే బానిసైనాడు మనిషి. దీనికితోడు ప్రపంచయుద్ధంలోపాల్గొన్న దేశాలు నైతికపతనానికి పాల్పడ్డాయి. ఒక్కుమ్మడిగా ఏర్పడిన ఈపరిస్థితే కళారంగంలోనూ ప్రతిఫలించింది. రాజకీయ సాంఘికరంగాలలో నైతిక సమగ్రతను నిలపటంలో కళారంగం విఫలమైం దని కళాకారులు భావించారు. ఈఅస్తవ్యస్త పరిస్థితుల్లో సాహిత్యవేత్తలు సహితం సాంప్రదాయికంగా సృష్టింప బడుతూ వచ్చిన సాహిత్యం సాధించిన ప్రయోజనం శూన్య మని భావించిరి. వారికి భవిష్యత్తు అంధకారబంధురంగా కన్పించింది. సమాజ నాగరికతపై తీవ్రమైన క్రోధము, కసి, ఏర్పడ్డాయి. ఈదశలో నవ్యసాహిత్యోద్యమాలు బయలుదేరినవి.

ఆనాటి మత సాంస్కృతిక సామాజిక వ్యవస్థలమీదఅసహనంతో,అసహ్యంతో ఆవిర్భవించిన నూతన కవితా ధోరణి 'డాడాయిజము'. 1 దీనికొక సిద్ధాంత దృక్పథంగాని, నిర్మాణాత్మక ధ్యేయంగాని లేదు. ఉన్నదల్లా పాతను ధ్వంసం చేయడమే. దీని ప్రారంభకుడు ట్రిస్టన్ జారా (Tristan Tzara) ఈవాదం 20వ శతాబ్ది నాగరికతను తీవ్రంగా దుయ్యబట్టి, సాహిత్యంలో ఒక అరాజక పరిస్థితి సృష్టించింది. డాడాయిజమ్ లోని విధ్వంసకతా లక్షణమే దాన్ని రూపుమాపింది. దాని శిథిలాలపైనే ఉద్భవించిన మరోనూత్న కవితాధోరణి 'సర్రియలిజమ్'

మొదట డాడాయిజమ్‌లోనే ఉన్నా తరువాత దానినుండి విడివడిన ఆంద్రే బ్రిటన్ (Andre Breton) ఈ ఉద్యమానికి మూల పురుషుడు. సర్రియలిజమ్ మొదట ఒక తాత్త్విక దృక్పథంగా, మనస్తత్వశాస్త్ర సిద్ధాంతంగా • సాహిత్యంలో చోటుచేసికొన్నది. ఐన్‌స్టీన్ సాపేక్షక సిద్ధాంతము (Theory of Relalivity) ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతము (Theory of Psycho-Analysis) దీనికి పట్టుగొమ్మలు. బియాట్రిస్. ఎమ్. సింకిల్ 'సైకో ఎనాలసిస్' ను ఇట్లు విడమర్చినాడు. '... Psyco-analysis in name given to the method developed for reaching down in to hidden depths of the individual to bring to light the under -lying motives and detreminants of his symptoms and attitudes and to reveal the unconscious tendencies which lie behind actions and reactions and which influence development and determine the realations of life itself...' ఈసిద్ధాంతంలో చేతన (conscious) కన్నా అచేతన (unconsciousness) ప్రాముఖ్యం వహిస్తుంది. ఈ రెండింటిని సముద్రం మీద తేలే 'ఐస్ బెర్గ్'తో (Ice-berg) పోల్చి చెబుతారు. ఐస్ బెర్గ్ సముద్రంలో తేలుతూ ఉన్నపుడు ఒకవంతు మాత్రమే పైకికనబడుతూ మిగిలిన తొమ్మిదివంతులు నీళ్ళల్లో మునిగి ఉంటుంది. ఆలాగే చేతనని బట్టి మనిషి మనస్తత్వంలో తెలిసే అతిస్వల్పభాగం. మిగిలిన అధికభాగం 'అచేతన' లో గుప్తంగా అంతుచిక్క

కుండా పోతుంది. చేతన బాహ్యప్రపంచానికి సంబంధించింది. ఇక అచేతన దానికి విరుద్ధమైనది. ఇందులో ఉండే కోర్కెలు హేతువాదానికిగానీ, సామాజిక నీతులకుగానీ సంబంధించినవి గావు. మనిషియొక్క ఆదిమకాలంనాటి కోర్కెలన్నీ దీంట్లో చోటుచేసికొంటాయి. ఈ కోర్కలసమూహానికే 'లిబిడో' (Libido) అని పేరుపెట్టాడు ఫ్రాయిడ్. ఇందులో ఉండే కోరికలు అధికంగా లైంగిక పరమైనవి "Libido is a term used in the theory of instincts of describing dynamic manifestation of sexuality..."[2]

అట్టి అచేతనలోని జీవితాన్ని వీక్షిస్తే కృత్రిమతా సంబంధంలేని అనేక విషయాలు బయల్పడతా యని 'సర్రియలిస్టులు' భావించారు. నియమ నిబంధనలకు, ఆచారసంప్రదాయాలకు కట్టుపడని అనుభూతుల నన్నింటినికవితారూపంలో పెట్టుటకు యత్నించారు వీరు. '.Pur Psychic Automalism by which it is intended to express verbally in writing, or by other means, the real process of thoughts. Thought's dedication, in the absence of all control exercised by the reason and out side all aesthetic or moral pre occupation" అని 1924 లో సర్రియలిస్టు మానిఫెస్టోలో పేర్కొన్నారు.[3] దీనితో మనస్సునకు ఇతఃపూర్వము లేని తీవ్ర ప్రాముఖ్యం కల్పించారు వీరు. మానసికవ్యవస్థకు పూర్తిస్వేచ్ఛాస్వాతంత్ర్యములు ప్రసాదించడమే తమధ్యేయమని ప్రకటించుకొన్నారు. 'Surrealism is not new means of expression, nor a simple one, nor even metaphysic of poetry, It is a means af total liberation of the mind and of everything resembling it"[4] ఈ విధంగా మనస్సుయొక్క యథార్థస్థితిని, అంతర్ముఖత్వాన్ని వెలుపలకు రానీయని సంప్రదాయ సంకెళ్ళను ధ్వంసంచేసి అవ్యక్తంలోని ఊహాలను తమ కవితకు భాష్యంగా మలచుకొన్నారు వీరు. ఏవంవిధ లక్ష్య సాధనలో గతనిరసనము, సంప్రదాయపు విధ్వంసము, వర్తమాన వ్యవస్థపై తిరుగుబాటు, అవహేళన, అధిక్షేపము, వ్యంగ్యము, సౌందర్యాన్ని వికృతం చేయడం మొదలగు పద్ధతులు అవలంబించారు. మెలకువకి, సుషుప్తికి, కలకి, తర్కానికి, బయటికి, లోపలికి, ఉన్నగోడలను బద్దలుకొట్టి సుప్తచైతన్యాన్ని వెలుపలికి తెచ్చారు. అచేతనలోని సమస్తం హేతుబుద్ధికి ప్రమేయం లేకుండా ప్రకటించారు.

ఇంతటి విస్తృత చరిత్రగల అధివాస్తవికత క్రీ.శ. 1929 నాటికి గాని ఇంగ్లాండులో కాలూనలేదు. 1942 కల్లా అచట ఈఉద్యమం చల్లారిపోయింది. దాదాపు అదే సమయంలో ఇది తెలుగులో అవతరించింది. తెలుగులో అధివాస్తవిక కవితను ప్రవేశపెట్టిన ఘనత శ్రీశ్రీది. 'రాజకీయాలలో నానాజాతిసమితి ఎటువంటిదో కళాప్రపంచంలో సర్రియలిజమ్ అట్టి దని' శ్రీశ్రీ అభిప్రాయం.[5] అయితే అధివాస్తవిక కవిత తెలుగులో ప్రవేశించే టప్పటికి తన తాత్త్విక గాఢతను కోల్పోయింది. కారణం ప్రపంచవాస్తవికతను భగ్నం చేయవలసిన, హేతువ్యవస్థనుకూలద్రోయవలసిన, ఇరుకు పరిస్థితి తెలుగుదేశంలో ఏనాడూ లేకపోవడమే' అంటారు శ్రీ వేల్చేరు నారాయణరావుగారు.[6] అందువలననే తెలుగులో అధివాస్తవిక కవిత కేవలం ఒక ప్రయోగ వాదం(Experimental Tendency) గానే మిగిలి పోయింది.

శ్రీశ్రీ, నారాయణబాబు మొదలగువారు ఈనూతనకవితోద్యమానికి మొదట పెట్టిన పేరు 'స్వరేలిజమ్'. అది సంతృప్తి నీయకపోగా కొందరు 'అతివాస్తవికత' అన్నారు. ఆతరువాత దానిపై కొన్ని విమర్శలు రాగా 'అధివాస్తవికత' పేరు స్థిరపడ్డది.

'దాడా తిరుగుబాటు– అధివాస్తవిక ప్రయోగము' అన్న గ్రంథంచదివి తాను అధివాస్తవిక గేయసృష్టి యొనర్చినట్లు శ్రీశ్రీ స్వీయవక్కాణము. దానికి నాటి 'జ్వాల' పత్రిక సంపాదకులు శ్రీముద్దుకృష్ణగారి ప్రోత్సాహము కొంతకారణమైనది. ఇట్టి ప్రోత్సాహప్రోద్బలాలతో ఉత్తేజితులైన శ్రీశ్రీ. శ్రీరంగం నారాయణబాబులు తెలుగులో అధివాస్తవిక గేయరచనలు చేసారు.

శ్రీశ్రీ 'ఖడ్గసృష్టి'లో ఈగేయాలు చేరాయి. Decompositions, ఆఖరిమాట మొదటిమాట, కొంటెకోణాలు, అభిసారిక గడియారి, అధివాస్తవికుల ప్రవేశం, రుబాయత్, విదూషకుని ఆత్మహత్య ఇత్యాదులు శ్రీశ్రీ స్వీయ అధివాస్తవిక రచనలు. ఖడ్గసృష్టిలోనే అధివాస్తవికోద్యమనాయకుడు Andre Breton వ్రాసిన Le Revolver aux chevevx blance (తెల్ల వెంట్రుకల రివాల్వర్) నుండి 'ఛాయాభంగిమలు' అన్న కవితను శ్రీశ్రీ అనువదించాడు. దీనిలో అధివాస్తవికధోరణి కన్పట్టుతోంది.

(సశేషం)

— 0 —

# మేలుకొలుపులు

— కుమారి ఎస్. లక్ష్మీనరసమ్మ, ఎం. ఏ.

భక్తిగేయములు జానపద వాఙ్మయము నందొక శాఖగ విలసిల్లినవి. మరియు నివి స్త్రీల పాటలయం దగ్రతాంబూలము నందుకొనినవి. స్త్రీలు గృహకృత్యము లను నిర్వర్తించునపుడు గూడ భగవద్విభూతిని కీర్తించుచు పెక్కుపాటలను పాడుచు ఇహపరములలో ముక్తినందుటకు యత్నింతురు. కావుననే స్త్రీ పారస్పతమునందు భక్తిగేయముల కీయబడిన ప్రాధాన్యము మరియే యితర గేయములకును లేదనియే చెప్పవచ్చు.

భక్తిగేయముల శాఖలోనికి చేరునవి మేలుకొలుపులు. ఈ మేలుకొలుపు సర్వసాధారణముగ భగవంతుని పరముగనుండును. తమ మేలు కొరకు భగవంతుని మేలుకొనుమని ప్రార్థించుచు మేలుకొలుపులను పాడుదురు.

మేలుకొలుపు షోడశోపచారములలో నొకటి. దీనిని దేవాలయములందు ప్రాతర్వేళలలో సామూహికముగ భగవంతుని మేల్కొలుపుటకై గానము చేయుదురు. దేవాలయములయందు గానము చేయు మేలుకొలుపులు వ్యవస్థాపూర్వకమైనవి. వీనికి స్త్రీపురుష వివక్ష లేదు. వీనినందరును గానము చేయుదురు. కాని మేలుకొలుపులన్నియు స్త్రీల పాటల పరిధిలోనికి చేరవు. దేవాలయము లందలి మేలుకొలుపులు వ్యవస్థాపూర్వకమైన వయిన; స్త్రీల పాటలలోని మేలుకొలుపులు అవ్యవస్థితములు, స్వగృహ పరిమితములు నైనవి. వ్రీడావ్రతులు, గృహిణులు కూడ పాడుకొనుట కుపకరించునవి మేలుకొలుపులు.

మేలుకొలుపులను గూర్చి ఆచార్య తూమాటి దోణప్పగారు ఈ విధముగా పేర్కొనిరి. 'తెల్లవారుజామున మేల్కొని యెవరికివారు ఇష్టదేవతా సంబంధమైన యేవో మేల్కొలుపులను పాడుకోవడం సైతం పరిపాటిగా వస్తున్నది. కొంతమంది ముక్కోటి ఏకాదశినాడు ఉపవసించి ఆ తెల్లవాఱె మంగళగాథికలయిన మేల్కొలుపులను పాడడం కూడా కద్దు. ధనుర్మాసంలో ప్రభాత సమయాన కొన్ని ప్రాంతాలలో చేసే నగర సంకీర్తనం మేలుకొలుపులకు విస్తృత రూపమని చెప్పవచ్చు. మేలుకొల్పులు సకల దేవతాపరాలుగా వాడుకలోనున్నట్లు స్పష్టమవుతుంది. మొదట మొదట దేవాలయాలలో అంగరంగభోగాలలో అవధరింపబడ్డ మేలుకొలుపులు రానురాను దేవాలయాల ఆర్థికస్థితి దిగజారినందువల్లనూ, పాతసంప్రదాయాల్ని నిలుపుకోవాలనే ఆసక్తి సడలినందువల్లనూ అన్ని భోగాలతోపాటు అంతరించాయి. అయితే జాతి సంస్కృతికి కాణాచియైన జానపద సాహిత్యంలో మేలుకొలుపులు కొన్ని మిగిలిపోయాయి.*

జానపద సాహిత్యమంతయు పల్లెపట్టుల యందే నిలచియున్నది. అదే విధముగ స్త్రీల పాటలు గూడ పల్లెటూరి వారైన కొలదిమంది స్త్రీల నోటియందు మాత్రమే జీవించియున్నవి. స్త్రీల పాటలన్నియును సమయము, సందర్భము, సంప్రదాయముల ననుసరించి గానము చేయబడునవే యైనను వానిలో మేలుకొలుపులకు కొంత ప్రాధాన్యమున్నది. ఇవి నిత్యము పాడుకొనుట కుపకరించునవి. మిగిలిన పాటలన్నియు నైమిత్తికములు. మేలుకొలుపులను నిత్యము గానము చేయుటవలన గృహమునందలి పసిపిల్లలకు భగవంతుని యందొక విధమగు నమ్మకము కలుగుట మాత్రమే కాక భగవద్భక్తిని సత్సంప్రదాయమును కూడ నెలకొల్పుట కుపకరించును. అదియును గాక తెల్లవారుజామున లేచుట అలవడుటయే గాక భగవద్భక్తిపూరితములగు పాటలను వినుటవలన వారికి భగవంతుని యందు భక్తిభావ మేర్పడును. 'భగవంతుని విషయములో తనకు మక్కువ కలుగుటకు కారణము తల్లి నిత్యము ప్రభాత సమయమునందు పాడు మేలుకొలుపులని యొక యోగి సెలవిచ్చినారు.

మేలుకొలుపులు నన్నయకు పూర్వము నుండియు ప్రచారమునందున్నవి. పాల్కురికి సోమనాథుడు ప్రభాత పదములు, నివాళిపదములు, గొబ్బిపదములు, మున్నగునవన్నియు తన కాలమునాడు విశేష ప్రచారము నందుండినటులు బసవ పురాణమునందు పేర్కొనినాడు. వీనిలోని ప్రభాతపదములను మేలుకొలుపులుగా ఊహింపవచ్చును. మేలుకొలుపులను దేవాలయములయందు ప్రభాత సమయమున గానము చేయుదురు. ఈ సంప్రదాయము నేటికిని కొన్ని దేవాలయములయందు నిలిచియున్నది. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము, లక్ష్మీనృసింహస్వామి సుప్రభాతము, అన్నవరము సత్యనారాయణస్వామి సుప్రభాతము, మున్నగునవన్నియు నీకోవకు చెందినవే. సుప్రభాతమునకు, మేలుకొలుపునకు కొద్దిపాటి సామ్యమున్నది. మేలుకొలుపుటయే రెండింటియందును ప్రధానోద్దేశము. కాని సుప్రభాతము శ్లోకరూపమున పద్యరూపమున నుండి సుదీర్ఘముగ నుండును. కాని మేలుకొలుపు

గేయరూపమున నుండి కొలది సమయము ననే పాడుటకు అనువుగనుండును. మేలుకొలుపులు స్త్రీలందరును పాడుటకు అనువుగ నుండునటులు రాగతాళయుక్తముగ రచింపబడినవి. సుప్రభాతము సంస్కృత పద భూయిష్ఠములై దీర్ఘ సమాస రచన కలిగియుండి కొలదిమంది స్త్రీలుమాత్రమే పాడుటకును, అభ్యసించుటకును ఉపయుక్తముగ నుండును. ఇటీవల శ్రీవేంకటేశ్వర సుప్రభాతము గేయ రూపమున వెలువడినదట.

లౌకిక సంస్కృత వాఙ్మయము నందలి తొలి మేలుకొలుపు ఆదికావ్యమగు రామాయణము నందు గలదు.

'కౌసల్యా సుప్రజా రామ
పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల
కర్తవ్యం దైవ మాహ్నికమ్'

అని విశ్వామిత్ర మహర్షి యాగరక్షణకై కొనిపోయిన రామ లక్ష్మణులను దైవ సంబంధమగు కార్యములను నిర్వర్తించుటకై మేలుకొను డనినాడు.

మనకు తెలిసినంతవరకు తెలుగులో పదకవితా పితామహుడగు అన్నమాచార్యులు రచించిన మేలుకొలుపులే మొట్టమొదటివి. అన్నమాచార్యులు స్త్రీలు పాడుటను ఉద్దేశముతో రచింపకపోయినప్పటికిని అవి స్త్రీలు కూడ పాడుకొనుటకు అనువుగ నుండును.

విన్నపాలు వినవలె వింతలు వింతలు
న్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా!
న్నులు మెల్లమెల్లనె విచ్చి
మేలుకొనవేలయ్యా
నిద్రమలు దిగి లేవయ్యా
నగుమోముతో లేవయ్యా'

అనునవి అన్నమాచార్యుల మేలుకొలుపులలో ప్రసిద్ధమైనవి. వానిని గృహిణులు కూడ నిస్సంకోచముగ గానము చేయవచ్చును.

మహాకవి క్షేత్రయ్య కృతమగు మువ్వ గోపాలపదములందుగూడ కొన్ని మేలుకొలుపులున్నవి. కాని యివియన్నియు శృంగారమయములై యున్నవి. ఇవి వ్రీడావ్రతులు, గృహిణులు నగు స్త్రీలు గానముచేయుట కుపకరింపవు.

ఈ మేలుకొలుపులు గేయ రచనల యందే గాక కావ్యరచనల యందును అచ్చటచ్చట ఉపయోగింపబడినవి. సాహితీ సమరాంగణ సార్వభౌమ శ్రీకృష్ణ దేవరాయ కృతమగు ఆముక్తమాల్యద యందలి మాలదాసరి కథయందు మేలుకొలుపు ప్రసక్తి గలదు. మాలదాసరి నిత్యము ప్రాతఃకాలమున దేవాలయమున కరిగి మంగళకైశికీ రాగములో భగవంతుని ధ్యానించుచుండు నని కలదు.

'రణద్విపంచియై, స్తుతికలిత ప్రబంధ
ములఁ జొక్కఁగపాడి...'
-ఆముక్తమాల్యద. ష.ఆ., ప.44

క్రీడాభిరామములో అచ్యుతుని గూర్చి కలదు.

రా,మాయణ మాలుకాండములు
నచ్యుత జాగర వేళఁబాడె
-క్రీడాభిరామము 170వ పద్యము

మేలుకొలుపులను ప్రాతఃకాలముననే గానము చేయుదురు. స్త్రీలు ప్రాతఃకాలమున గృహ కృత్యములను నిర్వర్తించుచునో లేక-చల్లచేయుచునో గొంతెత్తి వీనిని గానము చేయుచుందురు. పగటి సమయమంతయు జగమునేలి అలసిసొలసి నిద్రించు చుండు భగవంతుని నిద్ర మేల్కొలిపి ఆతని కర్తవ్యమును గురుతు చేయుచుందురు. 'దీనుల రక్షింపవేగ నిద్ర మేలుకో' అనుచు దుష్టశిక్షకుడు, శిష్టరక్షకుడు నగు భగవంతుని కీర్తించుచు మేలుకొలుపుదురు. ప్రజలను రక్షించుటకొరకు భగవంతు డెల్లపుడు నిద్రమేల్కొనియే యుండవలయునని వారి ఆశయము కావచ్చు నను నదే మేలుకొలుపులలోని అంతరార్థముగ గ్రహింపవచ్చును.

మేలుకొలుపులు సాధారణముగ భూపాలరాగమున గానము చేయఁబడుచుండును. కావుననే మేలుకొలుపులను భూపాలము లనియు పేర్కొనుచుందురు. పండిత గాయకుల రాగము బౌళి. జానపద గాయకుల రాగము భూపాలము. ఈ రెండు రాగములకును దగ్గర సంబంధమున్నదట. మేలుకొలుపులను భూపాల రాగము నందు మాత్రమే కాక మలయమారుతము, మంగళకైశికి మొదలగు ఉదయరాగములలో కూడ గానము చేయుదురు.

మేలుకొలుపులు భగవద్విభూతిని కీర్తించునవిగ నుండును. ప్రాతఃకాలమున భగవంతుని ధ్యానించిన పిదప తమ తమ విధులను నిర్వర్తించుచుందురు. తెల్లవారు జామున ప్రకృతి యంతయు ఆహ్లాదకరముగ నుండి మనసున కుత్తేజమును కలిగించుచుండును. అటువంటి ప్రశాంత సమయమున స్త్రీలు తమ ఒంటరితనము తెలియరాకుండుటకును, తాము చేయు పనియందలి కష్టమును మరచుటకును పాటలు పాడుకొనుచుందురు. సాధారణముగ ప్రాతఃకాలమున స్త్రీలు చేయు మొట్టమొదటి పని చల్లచేయుటయే. చల్ల చేయుచు భగవద్విభూతిని కీర్తించుచు తన్మయత్వముతో నీపాటలను పాడుకొనుచుందురు.

జానపద వాఙ్మయమునందు సాధారణముగ గేయకర్త పేరు తెలియదు సుదీర్ఘములగు కథాగేయము లందు మాత్రము రచించిన వారి పేరుగోచరించుచుండును. జానపద వాఙ్మయమునందంతర్భాగమును, ప్రముఖములైన స్త్రీలపాటలకును ఈ లక్షణము అన్వయించును. స్త్రీల పాటలలోని మేలుకొలుపులు అప్రయత్న సిద్ధములుకాక అవసరార్థము రచింపబడిన

వగుటచే వీనియందు రచించిన వారి పేరు గోచరించుచుండును. నరసింహదాసు, కందుకూరు రంబయ, కురుమద్దాల వేంకట దాసు, వేంకట శివదాసు, వేంకట సుబ్బయ్యార్యుడు, తిరుమలదాసు, మున్నగు రచయితల నామములాయా పాటలలో గోచరించుచుండును.

మేలుకొలుపులు దేవత లందరి పైని రచింపబడినవి. కాని యివి యెక్కువగా ముద్రణ భాగ్యమును పొందలేక పోయినవి. నేదునూరి గంగాధరముగారి మంగళహారతులు రెండుభాగము లందును పదునారు మేలుకొలుపులును, సెలయేరులో నాలుగు, వేడుక పెండ్లిపాటలయందు ఐదు, స్త్రీల పాటల సంపుటములందు పదమూడు ఈ విధముగ మొత్తము ఏబదికి తక్కువగనే ముద్రణభాగ్యమును పొందగలిగినవి.

ఈయా దేవతలనెడి భేదములేక దేవత లందరిపైని రచింపబడిన మేలుకొలుపు లెన్నియో గలవు. సీతాదేవి, పార్వతీదేవి, అలివేలుమంగ, కాశీఅన్నపూర్ణ పరముగ నున్నవి గలవు. ఇవిగాక గంగాదేవిని గూర్చినవియును, ప్రకృతివర్ణనము చేయునవియును, వేదాంతపరమైనవియును, మేలుకొలుపులు గలవు. వీనియందలి విషయమునుబట్టి వీనిని పది విధములుగ విభజింపవచ్చును. సేవాభావమును వ్యక్తము చేయునవియును, తమ్ము రక్షింపుమని ప్రార్థించు నట్టివియును, స్తోత్ర రూపముగ నున్నవియును, జీవిత గాథలను తెలుపునవియును, వర్ణనాత్మకముగ నున్నవియును శృంగారపరమగునవియును, మధురభక్తి పూరితములును, వేదాంతపరముగ నున్నవియును, వదినగారిపై రచింపబడినహాస్యపు మేలుకొలుపును, దేశభక్తి మేలుకొలుపును గలవు.

సేవాభావమును తెలుపుచు రచింపబడినట్టి మేలుకొలుపులలో కృష్ణుని పరముగ నున్నది ప్రఖ్యాతమైనది.

'బంగారు చెంబులో పన్నీరు పట్టుక
పణతి రుక్మిణి వచ్చె మేలుకో
రంగైన బంగారు కొంగీరబూసుక
తరుణిసత్య వచ్చె మేలుకో
దంతకాష్ఠముబూని తామరసాక్షి సు
దంత వచ్చినాది మేలుకో

అష్టమహిషులును, పదునారు వేల భార్యలును శ్రీకృష్ణునకు సేవలు చేయ సిద్ధముగా నుండి యాతనిని మేలుకొను మని ప్రార్థించుచున్నారు.

భవబంధముల నుండి కాచి రక్షింపుమని పరిపరి విధముల భగవంతుని వేడుకొనుచు రచింపబడిన మేలుకొలుపులున్నవి. 'దీనులైన జనులను రక్షించుటకు దీక్ష వహించిన దేవ వేగ నిద్ర మేలుకో' యని తమరక్షణభారమును భగవంతునిపై నుంచినారు.

ఘోరమైన సంసార బాధల
కడ తేరలేరు జనులు మేలుకో
దారిజూపి వారి దరిజేర్చకున్న
నెవ్వారు దిక్కు సామి మేలుకో
ఎంత వేడుకున్న సుంతైన కృపజూడ
వింతపరాకేల మేలుకో
చింతలుదీర నీచెంత జేరినాము
పంతము వల దిక మేలుకో

జనులు ఘోరమైన సంసారాంబుధిని తమకు తామే తరియించలేరు గావున వారికి దారిజూపి దరిజేర్పుమనియు, నీవు తప్ప నింకెవ్వరు దిక్కులేరనియు, మమ్ము రక్షింప వేగ నిద్ర మేలుకొను మనియు భగవంతుని దీనముగా ప్రార్థించుచున్నారు.

కేశవయని నిన్ను వాసిగ భక్తులు
వర్ణింపుచున్నారు లేరా
వాసవవందిత వసుదేవనందన
వైకుంఠపురవాస లేరా'

అను పాట కేశవ నామముల మేలుకొలుపుగ ప్రసిద్ధిగన్నది. స్తోత్రరూపముగనున్న వానిలో నిది యగ్రగణ్యమైనది.

రామాయణగాథను వర్ణించు మేలుకొలుపులు కొన్ని గలవు. వానిలో పుత్రకామేష్టి మేలుకొలుపునందు శ్రీరాముడు పుత్రకామేష్టి యందుద్భవించినది మొదలు సీతాకల్యాణము వరకును గల గాథయంతయు వివరింపబడియున్నది.

పుత్రకామేష్టి యందు పుట్టిన
శ్రీరామ పుండరీకాక్షుడ మేలుకో
పురుడు పుణ్యము పొందుగ
తీరెను పురుషోత్తమరామ మేలుకో
బారసాల మీకు బాగుగ జేసేరు
పట్టాభిరామయ్య మేలుకో
నామకరణము వ్రాసిరి నయముతో
దశరథులు నారాయణరామ మేలుకో
రామలక్ష్మణభరతశత్రుఘ్నులనే
నామకరణం వ్రాసిరి మేలుకో
ముత్యాల తొట్టెల్లో ముదముతో కౌసల్య
మురియుచు మిమ్ముంచె మేలుకో
బోటు లందరు గూడి పాటలు పాడేరు
భోగరామాచంద్ర మేలుకో

అనుచు సీతాకల్యాణము వరకును గల గాథ యంతయు మనోహరముగా వర్ణింపబడినది.

సిరిగల్గు కౌసల్య గర్భరత్నాకర –
శ్రీరామచంద్రుడ మేలుకో
సురల కానందము పొందా నుదయించిన
సూర్యవంశాగ్రణి మేలుకో
మేలుకో భక్తుల పాలించవలె నిద్ర
చాలించి యికనయినా మేలుకో
వాలాయముగ పనులూ చాలా
ఇక వున్నాం
వారిజలోచన మేలుకో

అనుచు వర్ణింపబడిన ఈ పాటయందు రామాయణగాథ యంతయు నున్నది.

(సశేషం)

---

* తెలుగులో క్రొత్తవెలుగులు – జానపద సాహిత్యంలో మేలుకొలుపులు, పు. 1(

ఆధునిక సాహిత్యంలో అంధయుగం ?

# ఉషఃకిరణాలు - ఒక ప్రామాణిక గ్రంథమేనా ?

— శ్రీ చిత్రగుప్తుడు.

( 15 వ సంచిక తరువాయి )

126 పుట. 'రెట్టమత శాస్త్రము. 1769 లో నొక గ్రంథము రచించిన అయ్యలరాజు అయ్యల భాస్కరకవులు 19వ శతాబ్ది ఆరంభమువరకును జీవించి యుందురు.... కర్నూలు మండలములోని యెఱ్ఱపాలెము నేలిన కొండ్రాజు వేంకట రాజునకు అంకితము చేసిరి.'

ఈ రెట్టమత మను గ్రంథమునందే వేంకటరాజు కామందక మను కృతిని చెప్పించుకొన్నట్లు గలదు.

అభిరామకామందకాఖ్యసత్కావ్య ర
త్నమునకు నేరాజు నాథుఁడయ్యె.

ఈ గ్రంథము నేడు ముద్రితమై లభించుచున్నది. కర్తయగు జక్కరాజు వేంకట కవి తన గ్రంథరచనా కాలమును క్రీ.శ. 1506 అని గ్రంథాంతమున తెలియబరచినాడు. వేంకటరాజు క్రీ.శ. 1506 అహోబలము నుద్ధరించినట్లు ఆ ఆలయ మహాద్వారమునగల శిలాశాసనము సాక్ష్యమిచ్చుచున్నది. కావున రెట్టమతము 16వ శతాబ్ది తొలిపాదమున నుద్భవిల్లిన గ్రంథము. 1

129 పుట. '18వ శతాబ్దిలో జరగిన కవులలో మరింగంటి సింగరాచార్యులు ఒకరు.'

ఇతడు 16వ శతాబ్దమున వెలసిన కవి. అచ్చతెనుగు యయాతిచరిత్ర పొన్నిగంటి తెలగన్నను ప్రోత్సహించిన మరింగంటి అప్పలాచార్యునికి చిన్నతమ్ముడు. క్రీ.శ. 1612 ప్రాంతమున వెలసిన రాజనీతిరత్నాకర కర్తయగు నేబతికృష్ణయామాత్యునిచే ప్రస్తుతింప బడియున్నాడు. కావున సింగరాచార్యుల కీగ్రంథమున పీఠములేదు. 2

130 పుట. 'గణపవరపు వేంకటకవి. ఇతడు 19వ శతాబ్దివాడో కాడో నిశ్చయముగా చెప్పలేము' అని చెప్పుచు 336వ పుటలో '18వ శతాబ్ది చివరనున్న గణపవరపు వేంకటకవి, నంద (జ) రాజ యశోభూషణము. ప్రతాపరుద్రీయము, రసమంజరి.రచించిరి.' అని నిశ్చయముగా 18వ శతాబ్ది చివరివాడని చెప్పిరి.

వేంకటకవి తన విద్యాపతీ దండకమును మధుర చొక్కనాథ నాయకుని సవతిసోదరు డగు ముద్దు అళఘాద్రి పేర రచియించియున్నాడు. అళఘాద్రి క్రీ.శ. 1674 ప్రాంతమువాడు. కావున వేంకట కవి 17వ శతాబ్దివాడు. 3

వేంకటకవి నంజరాజ యశోభూషణమును వ్రాయలేదు. దీనికర్త అలూరి నృసింహకవి. ఇది సంస్కృత లక్షణ గ్రంథము. 4 తెనుగు అనువాదమువచన ప్రాయమైనది నంజరాజు క్రీ.శ. 1750 ప్రాంతమువాడు. వేంకటకవి క్రీ.శ. 1670 పరిసరములవాడు. కావున గ్రంథకర్త యిచ్చిన వేంకటకవికాలము తప్పు.

135 పుట. 'కొన్నిశాస్త్ర గ్రంథములను తెనుగు చేసినవారిలో భైరవకవి యొకడు. ఇతడు రత్నశాస్త్రమును పద్యకావ్యముగా కూర్చెను.'

1917 లో వీరేశలింగంపంతులుగారు పరిష్కరించి ముద్రించిన ఆంధ్రకవుల చరిత్ర తొలిభాగమును గ్రంథకర్తచూడలేదు. 617వ పుటలో వా రిట్లు వ్రాసిరి.' ప్రమాణాంతరములవలన నన్యథాసిద్ధాంతమగువఱకును భైరవకవి తండ్రి హరిశ్చంద్రోపాఖ్యానాదులు రచించిన గౌరన మంత్రియే యని యంగీకరింతము' గౌరన మంత్రికాలము పంతులుగారు క్రీ.శ. 1440-50 అని చెప్పిరి. కావున భైరవకవి ఉషఃకిరణాలలో నడుగుపెట్టుటకు వీలులేదు.

285 పుట. 'విక్రమార్కుని చరిత్రకు సంబంధించిన యీ కథలను కొఱవి గోపరాజు చక్కని ప్రబంధముగా 18 వ శతాబ్దిలో రచించి ప్రసిద్ధుడాయెను.'

గోపరాజు క్రీ.శ. 1430-90 ప్రాంతమువాడని చాగంటి శేషయ్యగారు నిర్ధారించియున్నారు. 5 కావున గోపరాజును భైరవునివలెనే ఈ గ్రంథమున చోటులేదు.

133 పుట 'శుకసప్తతి. దీనిని రచించినవాడు పాలవేకరి కదిరీపతి. నెల్లూరు మండలమువాడు...

ఈ గ్రంథములో రెండు ఆశ్వాసములు మాత్రము దొరకినివి. పూర్తి పాఠము లభింపలేదు. ఈకవి నాయకవంశజు డని గద్యలో చెప్పుకొన్నాడు...

కదిరీపతి నివాసము ప్రస్తుత మైసూరు సంస్థానాంతర్గత కోలారు మండలము. కవి నాయక వంశజు డని గ్రంథాంతమున జెప్పికొన్నను గ్రంథావతారికలో క్షత్రియు డని స్పష్టముగనున్నది. అయినను క్షత్రియపలజు లాకాలమున నాయకశబ్ద వాచ్యులు కారు. కావున నీకవికులము నికరముగ జెప్పలేము. ఇంతేకను నీకవి

19వ శతాబ్దమువాడు కాడు. క్రీ.శ. 1660 ప్రాంతమువాడు.'

137 పుట. 'అలంకారశాస్త్రములలో ప్రసిద్ధమైన విశ్వగుణాదర్శము'

సంస్కృత విశ్వగుణాదర్శము వేంకటాధ్వరికృతము. కల్పిత చంపూకావ్యము. వేంకటాధ్వరి కీర్తికి మూల స్తంభము. కృశాను విశ్వావసునామక గంధర్వుల సంభాషణమున, ప్రధాన నగరములు, పుణ్యక్షేత్రములు నిందు వర్ణింపబడినవి. సన్నిధి-పంచాంగం-దేవరాజ పెరుమాళ్ళయ్యవారి టిప్పణాంధ్ర పద్యములతోఁ గూడిన విశ్వగుణాదర్శమూలము 1914 లో ముద్రితమైనది. సంస్కృతభాష కలంకారమైన గ్రంథము. అలంకార శాస్త్రగ్రంథము మాత్రము కాదు.

138. 'త్యాగరాజ మొదలియర్ ద్రావిడియైనను తెలుగులో చక్కని గ్రంథములు రచించెను. 1830-75వరకు చెన్నపురిలోనున్న ఈకవి విద్వత్కర్ణామృత మను పేరుగల సుబ్రహ్మణ్య విజయ మనెడి ఐదాశ్వాసముల పద్యకావ్యము రచించెను. ఇతని ఛందోరత్నాకర మను చిన్నఛందస్సు కూడ ముద్రింపబడినది. ఇతడు ఇంజనీరింగు డిపార్టుమెంటులో ఓవరుసీరుగా పనిచేసెను.' తిరిగి 175వ పుటలో'త్యాగరాజమొదలియను ద్రావిడ పండితుడు (1830-1880) సుబ్రహ్మణ్య విజయ మను ప్రబంధమును, విద్వత్కర్ణామృతము,ఛందోరత్నాకరమనుఛందస్సు, రచించెను.'

ఇట్టి పునరుక్తములవలన నీ గ్రంథ పుటసంఖ్య చాల పెరిగినది. సుబ్రహ్మణ్య విజయమనెడి విద్వత్కర్ణామృతము 138వ పుటలో నొకే గ్రంథమై, 175వ పుట వచ్చుసరికి రెండు గ్రంథములైనది. ఇతడు చెన్నపురిలో 45 సంవత్సరము లుండె [illegible] పంతులుగారు తమ కవిచరిత్రలో 'నీ కవి 25 సం॥ క్రిందట కాలధర్మమునొందె' నని చెప్పుటచే 1878 నాటికి 25 సం॥ పోగా 1853 ప్రాంతముల త్యాగరాజమొదలి కాలధర్మమునొందె నని చెప్పవచ్చును. గ్రంథకర్త చూపిన మొదలియార్ గారి మరణ సంవత్సరములు 1875-80 సరియైనవి కావు ఇతడు మహాభారతము నాంధ్రీకరించెను. తెలంగాణమున నైజామురాజ్యములో ఇంజనీరింగుశాఖలో చిరకాలము పనిచేసెను.

140 పుట. 'నడకుదుటి రామనకవి (1821-87) ద్విపద కావ్యములను పద్య కావ్యములుగా మార్చిన కవులలొకరు. పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యము నితడు పద్యకావ్యముగా రచించెను.'

అసలు రామన యే గ్రంథమును పద్య కావ్యముగా మార్చలేదు. ప్రభులింగలీల రామనకృతము. ఇది పాల్కురికి సోమనాథుని కృతి కాదు. పిడుపర్తి సోమనాథుని ద్విపదకృతి. వీరేశలింగం పంతులుగారి క్రింది వాక్యము లీ గ్రంథకర్త యెత్తి వ్రాసికొనెను.

'ఇతడు రచియించిన గ్రంథములలోఁ బ్రభులింగలీల పాల్కురికి సోమనాథుని ద్విపద కావ్యానుసారముగా నైదాశ్వాసముల పద్యకావ్యముగా రచియింపఁబడినది' ఇది పొరబాటు.

150 పుట. ద్విపద కావ్యములు. 18వ శతాబ్ది చివరి భాగములో ఓగుల ఏకోజీ రామాయణమును, పరమానంద తీర్థుని శివజ్ఞానమంజరి, 19 వ శతాబ్ది చివరి భాగమున పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారి ద్విపద మేఘదూత పేర్కొనదగిన కావ్యములు' ఓగుల ఏకోజీకాదు. భోసల ఏకోజీ. ఇతడు క్రీ. శ. 1636-37 నడుమ ద్విపద రామాయణము రచియించె నని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాసిరి.[1] పరమానంద తీర్థులు 16 వ శతాబ్దియని ఉషఃకిరణాలు తరువాత వెలసిన శారదా ధ్వజ మను గ్రంథమున ఈగ్రంథకర్తలే వ్రాసిరి. ఇక పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యుల వారి జనన కాలము 15-6-1897.[2] వీరు 1931 లో మేఘదూతము (ద్విపద) నచ్చొత్తించిరి. 19 వ శతాబ్దము చివరిపాదమున వీరి వయస్సు 3 సంవత్సరములు మాత్రమే.

152 పుట. 19 వ శతాబ్దిలో వచ్చిన వారిలో మండపాక పార్వతీశ్వరశాస్త్రి 'ఎనుబది శతకముల వరకు రచించెను. ఈయన బొబ్బిలిప్రాంతమున జన్మించినను, వెంకటగిరి సంస్థానములోనుండి ఆ సంస్థానాధిపతుల వంశానుక్రమమును వర్ణించెను.'

పార్వతీశ్వర శాస్త్రిగారిని గూర్చి ప్రత్యేక పరిశోధనము చేసినవారు పూండ్ల రామకృష్ణయగారు. పార్వతీశ్వర శాస్త్రిగారి శ్రీకృష్ణాభ్యుదయమునకు పీఠిక వ్రాయుచు 'ఇపుడు వారి గ్రంథములు 94 మిగిలియున్నవి.' యనియు కొన్ని మాలికలు, దండకములు పోయినవనియు తెల్పినారు. వీరు శతాధిక గ్రంథకర్తలని మాత్రము చెప్పవచ్చు. ఇందు శతకముల సంఖ్య మాత్ర మధికము. ఇందు వీరు 34 శతకములు వ్రాసిరి. వీరు వేంకటగిరి రాజగోపాల కృష్ణయాచేంద్రుల కంకితముగా శ్రీకృష్ణాభ్యుదయమును, ఏతత్ప్రభువుల పట్టాభిషేక మహోత్సవము వర్ణించు రాధాకృష్ణ సంవాదమును వేంకటగిరి ప్రభువును వీరు దర్శించినపుడు చెప్పినవి. ఈ గ్రంథములయందు వెంకటగిరి వంశ వృత్తాంతములు గలవు. కాని ప్రత్యేకముగా వేంకటగిరి వంశావళిని వీరురచించినట్లులేదు. రాధాకృష్ణ సంవాద, శ్రీకృష్ణాభ్యుదయములు రెండును ముద్రితములు. వీరు బొబ్బిలిసంస్థాన విద్వాంసులు వేంకటగిరి, బొబ్బిలి ప్రభువులు సంబంధ

బాంధవ్యము లున్నవారు. వెంకటగిరి సంస్థానమున నున్న వారుకారు.

152 పుట. ఈ కాలములోనే సత్యవోలు భగవత్కవి నూఱు శతకములు చేసినట్లు తానే చెప్పికొనెను.'

సత్యవోలు భగవత్కవి,ఏనుగులక్ష్మణ కవికి సమకాలికుడని వీరేశలింగంపంతులు గారు తెల్పియున్నారు. ఏనుగు లక్ష్మణ కవి 1770-80 ప్రాంతములవరకు జీవించియున్నట్లు పంతులవారే తమ గ్రంథమున వ్రాసియున్నారు. కావున భగవత్కవి కీ గ్రంథమున తావు లేదు.

188 పు. మచ్చవెంకటకవి. 'ఆ కాలమున వెంకటకవి బ్రౌను దొరగారితో చెలిమిచేసి మన్ననల నొందెనట.

'సీ.పీ. బ్రౌన్ దొరగారు మండలపు జ
డ్జీ సుప్రమేయంబులం
దేపారం జని గంగ యాహ్వాయుడు హో
యింగాంచి తా నాంధ్ర వి
ద్యా పాండిత్యము మేటి గ్రంథ పఠనా
ద్యస్తోక నైపుణ్యమున్
జూపెన్ రాజమహేంద్ర పట్టణమునన్
మార్యుత్తముల్ మే లనన్ ॥

ఈ కవి గిడుగురామమూర్తి పంతులు గారితో కలిసి పర్లాకిమిడి రాజా కళాశాలలో పనిచేసెను.

గ్రంథకర్త అంచనా ప్రకారము బ్రౌను, వెంకటకవి, రామమూర్తి సమకాలికులగుచున్నారు. పద్యమునందున్న గంగయ, వెంకటకవి జనకుడు. వెంకటకవికి 1893 లో 30 సంవత్సరముల వయస్సని పూండ్ల రామకృష్ణయ్యగారు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన పీఠికలో వ్రాసియున్నారు. అనగా వెంకటకవి జననము 1860వ సంవత్సరమైయుండును.

వీరిరువురు పుట్టక మునుపే బ్రౌను దొర 1855లో మనదేశమును విడిచి ఇంగ్లాండు దేశమునకు పోయెను.[1]

(సశేషం)

---

1. ఆంధ్రకామందకము_జక్కరాజు వేంకటకవి. పీఠికాకర్త. పరిష్కర్త. వేటూరి ప్రభాకరశాస్త్రి 1950
2. కుతుబ్షాహీసుల్తానులు - ఆంధ్ర సంస్కృతి-పుట 99 (1962).
3. విద్యావతీదండకము-మద్రాసుప్రాచ్యలిఖిత పుస్తకశాలపత్రిక. సం1. ం1. 1948 ముద్రితము. పరిష్కర్త. విద్యారత్న నిడుదవోలు వేంకటరావుగారు.
4. Gaekward Oriental Series No 47. Baroda. (1930)
5. R 731. ప్రాచ్యలిఖిత పుస్తకశాల. మదరాసు.
6. ఆంధ్రకవితతరంగిణి_6వసం.పుట139
7. భారతి. నవంబరు 1945. పుటలు. 389-396 వ్యాసకర్త. డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు అంతకుముందే 'ఆంధ్రి' పత్రిక (సం. 3. పుటలు 89-92) లో నిడుదవోలు వేంకటరావుగారు కవికాలమును చక్కగ నిర్ణయించినారు.

1. అ.క.చ. తృతీ. పుట 339. ఈ పొరపాటు ఆంధ్రకవి సప్తశతి పుట 190 లో గూడ దొరలినది.

1. తంజావూరు మహారాష్ట్ర భూపతులు_ఆంధ్ర సాహిత్యము. భారతి జనవరి 1954. పుటలు 35.36

2. విద్యార్థి కల్పతరువు. వెంకట్రామా అండ్ కం., 1967. పుట. 864

1. ఆంధ్రకవుల చరిత్ర-తృతీయ భాగము 82, 346.

1. సి.పి. బ్రౌన్. డా.కొత్తపల్లి వీరభద్రరావు-1963. పుట 76.

---

# ఈనాటి నవలలు ఎలా వుండాలి ?

కుమారి వి. దాక్షాయణి, ఎం.ఏ.బి.ఇడి.

నవల అనగానే నవ్యత. స్ఫురించేది అని అర్థం. అయినా క్రొత్త లక్ష్యాన్ని చేకొని నిరూపించడం సాహసమే అవుతుంది.

ఇప్పటికి లెక్కలేనన్ని నవలలు వెలువడ్డాయి. కాని మన్ననైన నవలలను వేళ్ళ మీద లెక్కించవచ్చు.

జీవితమే సుఖదుఃఖాల మయం. మనిషి జీవితంలో అవి ఎలా కలుగుతున్నాయి? ఆయా సందర్భంలో ఆమనిషి ఎలా ప్రవర్తిస్తున్నాడు? అన్నదే కదా! నవల యొక్క ముఖ్యోద్దేశము. ఆ ముఖ్యోద్దేశము. పఠితలకు ఉపదేశాత్మకముగా నుండవలెననుటయే ఆవాదినుండి వస్తున ఆచారము.

ఈనాటి నవలలు ప్రజలసమిష్టి జీవితాన్ని చిత్రించడానికి మారుగా వ్యక్తుల ప్రైవేటు గాథలుగా మాత్రమే ప్రదర్శించినట్లు కన్పిస్తున్నాయి.

స్వతంత్ర భారతదేశంలో అనేక సమస్యలు వున్నాయి - భాషా రాష్ట్రాల సమస్య, నిరుద్యోగం, అసమానత, కులతత్వ భేదాలు, నవలలో సరిగా విడమర్చి చెప్పడంలేదు. సమస్యలను, వాటి నివారణోపాయములను ప్రతిబింబించని నవలలు సమాజం మీద ప్రభావం చూపుతాయనుకోడం కేవలం భ్రమే అవుతుంది.

ఏ రాజకీయపార్టీయైనా ప్రజలకు సన్నిహితంగా లేకపోతే నేలవిడిచిన సామే అవుతుం దన్న విషయాన్ని నవలాంశములో మిళితం చేసినప్పుడు ప్రజాభ్యుదయానికి పాటుపడిన వారౌతారు.

చదువు కుంటున్న అమ్మాయిల మీద ఈనవలాప్రభావం ప్రత్యేకంగా వుంది.

హీరోలాగా...ఎడమచేతితో సిగరెట్టు త్రాగుతూ కుడిచేతితో అవలీలగా కారు నడుపుతూ–రంగుకళ్లద్దాలతో వుండాలని కలలు గంటారు. వారి కలల ప్రకారము ఏ చంద్రుడో! ఇంద్రుడో! కుబేరుడో! వచ్చి తమను పాణిగ్రహణం చేసుకొని–పువ్వుల్లో పెట్టి పూజిస్తాడని అనుకొంటారు. చివరకు అట్టిభర్త లభించకపోతే చిరాకు. ఏదో పోగొట్టుకొన్నట్లు బాధపడ్తారు. మధ్యతరగతి యువతులు తమ కలలవంటి నవలా నాయకుణ్ణి కనుగొన్నట్లు భ్రమపడి తప్పటడుగులు వేస్తారు. ఆతర్వాత జీవితాంతం బాధపడ్తారు.

స్త్రీలకు జరుగుచున్న అన్యాయాలను ఏకరువుపెట్టి వ్రాస్తున్నారు. వారి స్వతంత్రతను కాపాడుతున్నారు – అంతవరకు బాగానే వుంది. కాని ఈ స్వతంత్రతను మరీ విపరీతంగా రచయితలు సృష్టిస్తే ఆలూమగల అనురాగానికి గొడ్డలిపెట్టౌతుంది.

ఈమధ్య ఒకరచయిత్రి తనరచనలో భార్యాభర్తల వాగ్వాదంలో– భార్య భర్త చెంపమీద కొడ్తుంది. ఇది ఏమంత సమంజసమో ? స్త్రీ లోకంలో ఎంతటి పరిణామాన్ని తెస్తుందో ? విచారణీయము. పాత్రచిత్రణ పఠితల హృదయం మీద ముద్రవేస్తుందనే విషయాన్ని మరచిపోరాదు.

ఆనాటి సాహిత్య ప్రక్రియలన్నీ ఉద్యమాలతో సాంఘికసంస్కరణలతో పెనవేసుకుపోయాయి. సాంఘిక దురాచారాలను, మూఢనమ్మకాలను ఆలంబనం చేసుకొని నవలారచన సాగించారు.

సామాజిక ప్రయోజనాలకోసం సాహిత్యాన్ని వినియోగించాలన్న సత్యం వీరేశలింగం, గురజాడ అప్పారావు మున్నగు సంస్కర్తల రచనలలో కన్పిస్తుంది. కాని ఈనాడు అవి మృగ్యం. ఇప్పటి నవలలు కేవలం వ్యాపార దృక్పథంతో వ్రాస్తున్నట్లు తోస్తుంది.

ఈనాటి నవలలు కొన్నింటిలో రచయితల శక్తియుక్తులు కేవలం బహిస్స్వరూపానికే పరిమిత మయినట్లు అనిపిస్తుంది.

పఠితలలో సస్పెన్స్ కలిగించాలని అనుకుంటారో ? ఏమో?– తామెన్నడు చూచి, కనివిని యెరుగని విషయాలను సైతం అలవోకగా ఎరిగివున్నట్లు వ్రాసి నవలలను విసిరివేయడం జరిగుతున్నది– అల్లాయుద్దీన్ అద్భుతదీపంలా ! నవ్వు వస్తున్నది.

ఈనాడు నవల అనగానే ఒకనాయిక నాయకుడు– వారి ప్రేమా, పెళ్ళి, లేక వారి ప్రేమ–త్యాగము లేక ఇరువురి ఆత్మహత్యవంటి విషయాలుకానవస్తున్నాయి. ఈనాటి సంఘంలో స్వార్థం, భోగాసక్తి ఇంద్రియలోలత ఎక్కువగా తాండవిస్తున్నాయి. అందువలన మానభంగాలు, వ్యభిచారం, దొంగతనం, లంచగొండితనం వంటి నేరాల సంఖ్యలు పెచ్చుపెరిగి పోతున్నాయి. ఉద్రేకాలు వినోదాలు పరాకాష్ఠను చేరుకొన్నాయి. ఆడవారి రక్షణకు కొదవ ఏర్పడింది. నవలా సాహిత్యం నీతిశాస్త్రంలా నీతులుబోధించలేకపోయినా, ప్రజలలో ఆ జిజ్ఞాస, ఆ దృక్పథాన్ని పెంపొందించకలిగి వుండాలి.

తప్పుడుతూకాలు, కొలతల వల్ల వ్యాపారస్థులు కొన్నికోట్లు సంపాదిస్తున్నారు. సామాన్య ప్రజానీకం తల్లడిల్లిపోతోంది. ఇట్టి మోసాలను ఎత్తిచూపుతూ– వానికి తగినశిక్షలను నవలద్వారా ప్రత్యక్షం చేయాలి. భగవంతునిదృష్టిలో పాపికి విముక్తి వుండదను విషయాన్ని ఎత్తిచూపాలి.

ముఖ్యంగా ఈనాటి విద్యార్థులందు చదువుపై ఆసక్తి లేదు. కోతికి కల్లు



ది 6-7-80 తేదీని జరగబోవు శాసన మండలి ఉభయ గోదావరి జిల్లాల పట్ట భద్ర నియోజకవర్గపు ఎన్నికకు పట్ట భద్రుల వోట్లను అభ్యర్థించుచున్న

శ్రీ ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావుగారు

త్రాగించినట్లు ప్రణాళికలు, విద్యావిధ నము, నవ్వు పుట్టించేవిగా వున్నాయి ఇట్టి విషయాన్ని నవలారూపంలో మిళిత చేస్తే జ్ఞానోదయం కలిగే అవకాశ వుంది.

నవల మళ్ళీ మళ్ళీ చదివించేదిగా వ డాలి. చదివిన నవల హృదయాలనుహ కోవాలి. ప్రజాసామ్యన్నీ రాజకీయా సరియైన దృక్పథంతో విశ్లేషించి ద చూపే నవలలు కావాలి.

కాబట్టి మారుతున్న జీవితాన్ని మ తున్న విలువలను ప్రతిబింబించే తెల

(తరువాయి 18 వ పేజీలో)

# కనకదుర్గాక్షేత్రము

— శ్రీ మల్లాది కామేశ్వరరావు.

సాక్షాద్విష్ణుపరమాత్మయే కృష్ణానది. మహాఋషు లనేకులు వారి మంత్రశక్తులను ధారపోసి మహాతీర్థముగా జేసిన ఈనది కిరుప్రక్కలయందు దాదాపు అరువది పుణ్యక్షేత్రము లెంతో మహిమతో విరాజిల్లుచున్నవి. వాటిలోనొకటి కనకదుర్గాదేవీ క్షేత్రము.

కనకదుర్గాలయము బహు పురాతనమైనది. స్వయం ఉద్భవమైన కారణంగా దీనికాలనిర్ణయము చేయుట బహుక్లిష్టమైయున్నది. అస లేనాడు స్వయంఉద్భవమైనదో చెప్పుట కష్టముగాని, దాదాపు తొమ్మిదవశతాబ్ది పూర్వమునుండి కల పురాతనాలయ మని అమ్మవారి యారాధనా కైంకర్యాదులకు భక్తులచే నొసంగబడిన దానములు శిలారూపమున లభించగా తెలియుచున్నది.

త్రేతాయుగము నందు శ్రీ రామచంద్రుడు అరణ్యవాసము సల్పినపుడు సీతాసమేతముగావచ్చి ఇంద్రకీలాద్రిపై ఉద్భవించియున్న కనకదుర్గాదేవిని అర్చించినట్లును, సీతారామచంద్రులకు కనకదుర్గాదేవి ప్రసన్నురాలైనట్లును, ఈమహాక్షేత్రమునకు శ్రీ ఆంజనేయస్వామియే క్షేత్రపాలకు డనియు, హనుమంతుడు సూర్యభగవానుని యొద్ద వేదాభ్యాసము పూర్తియైన పిమ్మట దుర్గాదేవిని జూచి స్తోత్రము చేసినట్లును నొక ప్రతీతి.

సర్వపాపములను శమింపచేసి, శాంతి సౌఖ్యాదులనిచ్చి, సంసారవిషయములనుండి రించుమార్గముజూపి, దుష్టులకు జయింపశక్యముకాని యజేయశక్తులను భక్తుల కొసగి రక్షణ నీయగల దుర్గము వంటిది కావున దేవికి 'దుర్గ'యని పేరు వచ్చినది.

బ్రహ్మాండపురాణము, పద్మపురాణము లీదేవిని గూర్చి, యామె మహిమను గూర్చి, విస్తారముగా చాటుచున్నవి. పురాణ ప్రసిద్ధమగు 'కిరాతార్జునీయ' గాథ యీ క్షేత్రమహాత్మ్యమునే కాక దేవీశక్తి సామర్థ్యములను తెల్పుచున్నది. అనేక సిద్ధులు, మానవులు కనకదుర్గాదేవి మహిమచే తరించి యనంత సౌఖ్యముల నందిరి. కనకదుర్గాదేవీ క్షేత్రము శక్తి ప్రాధాన్యముగల క్షేత్రమై ప్రసిద్ధికెక్కినది. పవిత్ర కృష్ణవేణీతీరమున నింద్రకీలాద్రిపై సాన్నిధ్యముచెంది, అనేకానంత పుణ్యక్షేత్రములతో వలయీకృతముగా నావరింపబడి కనకదుర్గాక్షేత్ర మత్యంత వైశిష్ట్య ప్రతిభల నందుచున్నది. దుర్గాక్షేత్రమైన ఆనగరమునకు పలునామములు గలవు.

'విజయవాడ' :- ఈశ్వరుని జయించి, మెప్పించి కిరాతార్జునీయ ఘట్టమున పాండవమధ్యముడు విజయుడైన కారణమున ఈ నగరమునకు 'విజయవాడ'యను పేరు వచ్చినది.

'కనకవాడ, కనకపురి' :- కనకదుర్గాదేవి రాక్షస సంహారముచేసిన తరువాత దేవత లామెను ప్రార్థించగా ఆమె కరుణించి,అభయముగ కనకవర్షము కురిపించుటచే ఈనగరమునకు 'కనకవాడ' 'కనకపురి' యను పేర్లు వచ్చినవి.

'బెజ్జంవాడ' :- కృష్ణానది సాగర సంగమవాంఛతో ప్రవహించుచూవచ్చుచుండగా నింద్రకీలాద్రి యడ్డమైమార్గమీయలేదు. అపుడు దుర్గాదేవిని తనకు పతిభిక్ష పెట్టుమని కృష్ణానది ప్రార్థింపగా దుర్గ కరుణించి సూదిమొనంత బెజ్జము నిచ్చెనట. కృష్ణ దానిద్వారా విపరీతవేగముతో ప్రవహించగా ఆకొండ రెండుప్రక్కలై పగిలిపోయెనట. ఇట్లు బెజ్జముపగిలి ఏర్పడినది కావున ఈనగరమునకు 'బెజ్జంవాడ' యను పేరు వచ్చినది.

'బీజవాడ, బెజవాడ' :- దేవీపూజార్హమైన బీజాక్షరము లీకొండపై లభించెనట... కృష్ణ యనేక బీజములను దెచ్చి ఈనగరమును సస్యశ్యామల మొనర్చిన కారణమున నీనగరమునకు 'బీజవాడ' 'బెజవాడ' యను పేర్లు వచ్చినవి.

'ఫల్గుణ క్షేత్రము' :- ఫల్గుణుడు తన తపోబలముచే దివ్యమైన పాశుపతాస్త్రమును పొందిన కారణమున ఈనగరమునకు 'ఫల్గుణ క్షేత్రము' అను పేరు వచ్చినది.

ఇంకా, దేవీనగరము మున్నగు నెన్నో పేర్లు గలవు.

ప్రతిదినము వేలకొలది భక్తులు దేవిని దర్శించి తమతమ మ్రొక్కుబడులను తీర్చుకొని వెళ్ళుచుందురు. దేవిని దర్శించిన వారిని; దేవీమహత్మ్యమును, దేవి గాథను విన్నవారిని దేవి కరుణించి వారివారి అభీష్టములను తీర్చును. ప్రతి విజయదశమికి దేవీనవరాత్రులు ఘనంగా జరుగును. ఆతొమ్మిది దినములలో లక్షలకొలది భక్తులు నిత్యమూ దేవిని దర్శించి, దేవి అవతారములను తిలకించి కృతార్థులగు చుందురు.

—:0:—

( 17 వ పేజీ తరువాయి )

నవలలు వెలువడాలి. ఈనాటి సమాజంపై అధిక ప్రభావం కలిగివున్నవి- సినిమాలు, నవలలు, కథలు, కథానికలు, నాటకాలు మున్నగునవి.

మనిషి హృదయం అతిసున్నితమైంది ఏదైన ఒకవిషయంపాదుకుపోయిందంటే దాన్ని గురించే ఆలోచిస్తుంది. అట్టి మన మనస్సును మంచివైపునకు మరలించాలి. కాబట్టి ఈనాటి నవలలు ఉపదేశాత్మకంగా ఆనందదాయకంగా వుండాలని ఆసిద్దాం.

—:0:—

## ఉద్గ్రంథములు

| | | |
|---|---|---|
| 1) | నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) | రు. 50—00 |
| 2) | నిర్వచన అధ్యాత్మ రామాయణము | రు. 20—00 |
| 3) | నిర్వచన మహాభాగవతము | రు. 30—00 |
| 4) | శ్రీ వేంకటేశ్వర విజయము | రు. 25—00 |
| 5) | కుందమాల నాటకము | రు. 5—00 |
| 6) | వేణీసంహార నాటకము | రు. 5—00 |
| 7) | శ్రీ వాల్మీకి రామాయణము మొదటి సంపుటము | రు. 30—00 |

కృతికర్త : ప్రకాశకుడు :

బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.

8-22-14, గాంధీనగర్, కాకినాడ-4.

# రచయితలకు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకు ప్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁగాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన కొలఁదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.